వినాయకచవితిసంచిక



# ఆంధ్రసచిత్రవారపత్రిక

20-9-74

55 పైసలు

# చిత్రకళా ప్రదర్శనం

కవి కన్నీరు కార్చమంటే కలం ఎత్తుతాడు చిత్రకళాకారుడు తన కుంచె తిప్పుతాడు — సమాజాని కతీతమైన భావనా ప్రపంచాన్ని వదిలి, పరిసరాలకు, పరిస్థితులకు అనుగుణంగా స్పందించుతున్నారు మన కళాకారులు ఆగష్టు నెలో విజయవాడలో సాంస్కృతిక సంస్థ చైతన్య భారతి వారు ఐదుగురు ప్రముఖ ఆధునిక చిత్రకళాకారులు "భారతదేశపు వర్తమానగతి ప్రగతుల మీద చేసిన రంగుల వ్యాఖ్యలకు వేదికనమర్చి ప్రదర్శించారు ఈ అయిదుగురు కూడా విజయవాడ పౌరులను విశేషంగా ఆకర్షించారు

రాజకీయాలు, కరువు కాటకాలు వీధి మానిసి గుండెల్లోను కడుపులోను రగిలే మంటలు, వీరి చిత్రకళావస్తువుల —

అణుశక్తి పాటవ పరీక్షమీద వీరుచేసిన వ్యాఖ్యలు గమనార్హం శ్రీయుతులు పి అర్ రాజా, కె ఎస్ రెడ్డి, జి బాలు, వై హనుమాన్సూరి, డి భాస్కరరావుల 30 చిత్రాలు కూడా ప్రేక్షకులలో కుతూహలాన్ని రేకెత్తించి గిరిచేత ప్రశ్నలు వేయించాయి వాటికి ప్రదర్శనా ప్రాంగణంలో తిరుగాడుతున్న చిత్రకళాకారులే స్వయంగా వివరణ ఇవ్వడంకూడా బాగుంది —

[పి]

అమ్మకానికి సెక్సు — వై. హనుమాన్సూరి

మన అణుశక్తి ప్రేలుడు — కె. ఎస్. రెడ్డి

ఎన్నికలొస్తున్నాయి — డి. భాస్కరరావు

మన బాంబ్ — పి. ఆర్. రాజు

'కడుపు మంట చల్లారాలి' — జి. బాలు




నిర్మాత వజ్జే పూర్ణచంద్రరావు దర్శకత్వం కె. వరప్రసాదరావు M.A.

నిర్వహణ వజ్జే నాగేశ్వరరావు సంగీతం పెండ్యాల

ఆంధ్ర కృష్ణ, పశ్చిమగోదావరి, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు అన్నపూర్ణా ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు

శ్రీకాకుళం, వైజాగ్ జిల్లాలకు· శ్రీపద్మాపిక్చర్సు వైజాగ్ ఓడెడ్ నటేశ్ ఫిలింస్ ఎక్సేంజి

**1974 దీపావళి కథల పోటీకి కథలు మాకు అందవలసిన ఆఖరు తేదీ 20–9–'74**

—సం.

కె ప్రత్యగాత్మ సమర్పించు

సత్యా ఎంటర్ ప్రైజెస్ వారి

# ఆడపిల్లల తండ్రి

కథ నిర్మాత దర్శకుడు కె వాసు





సంగీతం టి చలపతిరావు

సొంత డిస్ట్రిబ్యూటర్స్ అనిల్ ప్రభాస్ ఎంటర్ప్రై...

(సర్కార్ జిల్లాలకు మాత్రం)

విడుదల శ్రీ ఫిలింస్

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం 20–9–'74

ఆనందనామ సం నిజ భాద్రపదమాస శు పంచమి

*సంపుటము 68 సంచిక 1*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు 31–20 పై.
ఆరుమాసాల చందా – రు 15–60 పై.
ఒక్కప్రతి వెల 55 పైసలు

*ఆంధ్రపత్రిక కార్యాలయము*
*గాంధీనగరం, విజయవాడ-3*


## విషయానుక్రమణిక



### వినాయకచవితి

కాపాడు కాపాడు వినాయక
కష్టాలు నష్టాలు రానీయక!
కల్లలూ కపటాలు ఎరుగనీ
పిల్లవాళ్లము మమ్ము దయగనీ !!

ఏనుగు తొండమ్ము ఫాడవని
ఎకసక్కెపు మాటలాడమయా!
ఎలుక వాహనమెక్కి వచ్చావని
చులకనగ నిన్ను చూడమయా !!

ఓ బొజ్జ గణపయ్య దండాలయా
మా పజ్జనే నిలచి వుండాలయా!
ఈ సజ్జ పూలన్ని నీకేనయా
మా ఒజ్జవై విద్దె లొసగాలయా !!

మారేడుకన్న మునులేచామయా
నేరేడు మారేడు తెచ్చామయా!
కుడుములూ ఉండ్రాళ్లు
పెట్టామయా
ఇడుములూ నీవె పోగొట్టాలయా !!

— అలపర్తి వెంకట సుబ్బారావు

# వెనకయ్య వింతలు

'తుండము నేకదంతమును
తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును
మెల్లని చూపుల మందహాసమున్
కొండొక గుజ్జురూపమును'

అని వినాయకుని వింతరూపు వివరంగా తెలుస్తూ ఉంది. ఏనుగు తల, గుజ్జురూపు, ఒంటి దంతం, కుండ బొజ్జ, పొట్టివెయ్యి, మెల్లచూపు —

ఈ అందానికి చిరునవ్వు మరికొంత అందాన్ని కూరుస్తున్నది!

ఇట్టి వేలుపు ఎవర్ని ఆకర్షిస్తాడు? అదీకాక దండిగా విఘ్నాలను సేకరించి ప్రత్యక్ష మవుతాడాయె

అయితేనేం? వేల్పులలో ఇతడిదే మొదటి తాంబూలం! ఈ వికార రూపుణ్ణి ఎవ్వరూ



## * మనలోమాట *

వినాయక చవితి దేశంలో అందరికీ ప్రియమైన పండుగ, ఆంధ్ర సచిత్ర వారపత్రికకి మరీ ముఖ్యమైన పండుగ — 67 సంవత్సరాల క్రితం గణేశ నవరాత్రి ఉత్సవాలలోనే ఆంధ్రపత్రిక పుట్టింది— ఈ సందర్భంలో పాఠకులకు, రచయితలకు, ఏజెంట్లకు, ప్రకటన కర్తలకు అందరికీ మా ప్రత్యేక శుభాకాంక్షలు

* * *

ఈ వారం నుంచి ప్రారంభమైన "లాలస" సీరియల్ రచయిత్రి శ్రీమతి కాకాని కమల గారు లోగడ పత్రికలకు రేడియోకి రచనలు చేస్తున్నవారే కాని యిది ఆమె తొలి నవల 1953 లో పుట్టిన యీమె పిన్న వయస్సులోనే రచన ప్రారంభించారు చిత్రకళలో డిప్లొమా పొందడమేగాక కుట్టుపు, టైలరింగ్ కూడా నేర్చుకున్నారు ఫాబ్రిక్ పెయింటింగ్ హాబీలలో ఒకటి భర్త ఉద్యోగరీత్యా యిప్పుడు ఆమె సూర్యాపేటలో వుంటున్నారు

* * *

ప్రచురణార్థం మాకు గేయాలు, కవితలు పంపేవారు సాధ్యమైనంత చిన్నవి పంపటం అవసరం అంతేగాక, కవితతో పాటు స్వంత చిరునామాగల పోస్టుకార్డు జతచేసి పంపాలి పరిశీలనానంతరం ఆయా రచయితలకు సంపాదకుని నిర్ణయం ఆ కార్డు మీదనే తెలియచేస్తాము గేయాలు, కవితలు యిక మీదట తిప్పి పంపటం సాధ్యం కాదని మనవి పరిశీలనకు కనీసం ఆరు వారాలు పట్టవచ్చును

* * *

ఈ సంచికలో వారం వారం పడే కొన్ని శీర్షికలు చోటు చేసుకోలేక పోయాయి కారణం వేరే చెప్పనక్కరలేదనుకుంటాము

పూజించరేమో అని దేవత లందరూ ఏ కార్యం తలపెట్టినా మొట్ట మొదట వెనకయ్యనే పూజించాలని, తీర్మానించారు

సంస్కృతం వారి వినాయకుడు తెలుగు వారి వెనకయ్య ఇతడు పేరులో వెనకయ్య అయినా పూజలో ముందయ్యయే !

దేవతలు శాసిస్తే మాత్రం అందరూ వింటారనే నమ్మక మేదీ ? ఇది వేల్పులకూ తెలుసు అందుచేత — మొదట వినాయకుణ్ణి పూజించకపోతే—తలచుకొన్న కార్యం నిరాటంకంగా జరగదనీ, అట్టి వారిపైకి ఈ గుజ్జు వేల్పు విఘ్నాలను విడుస్తాడనీ ఒక అనుబంధ శాసనం కూడా ఏర్పరిచారు

అమృతం కోసం దేవదానవులు పాలసముద్రాన్ని మధించేటప్పుడు ఆ తొందరలో ఇతణ్ణి మరిచిపోయాడు తత్ఫలితంగా వారికి హాలాహలంలభించింది దీనికికారణమేమిటనిచర్చలు జరిగాయి అసలు సంగతి శివునికి స్ఫురణకు వచ్చింది మొదట వినాయకుణ్ణి పూజించకపోవడమే దీనికి కారణమనిచెప్పి ఆయన అందరిచేతా వినాయక పూజ జరిపించాడు తర్వాత కావలసిన అమృతం మొదలైనవిఉద్భవించాయి

ఆ నాటినుంచి ఈ నాటివరకూ ఏకార్యం తలపెట్టినా "నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం ఆదౌ గణాధిపతి పూజాం కరిష్యే" అని సంకల్పం చెప్పకొని ఇతణ్ణి మొదట పూజించడం జరుగుతూనే ఉన్నది

గణపతి గజశిరస్కుడై ఎందుకుండాలి ? ఒంటి దంతమే ఎందుకుండాలి? అనే ప్రశ్నలు తోచకపోవు

ఒక కథనం ప్రకారం గజాననుడు సతీ శివుల పుత్రుడు ఆ ఆదిమ దంపతులు గజ

(32 వ పేజీ చూడండి)

# ఫాలాక్షుని డైరీ

**స్త్రీ హంతకులు!**

ఆడవారు మగవారికి ఏ విధంగానూ, ఎందు
తీసిపోరని హత్యలు చేయడంలో కూడా ఆడవార
మగవారికి తక్కువ కారని అంత రాక్షసంగాను
చేయగలరని డస్సెల్ డార్ఫ్ విశ్వవిద్యాలయం ప్రొ
సరు ఎలిజబెత్ ట్రూబ్—బెక్కర్ తన పరిశో
నలో తేల్చారట. ఆడవారు హత్యలు సామాన్యం
యిళ్లల్లో చేస్తారని, వీరు చేసే హత్యల్లో ఎక్కు
భాగం ప్రేమ, ప్రియుడు, అక్రమ సంబంధ
వంటి కారణాలు ఎక్కువని వెస్ట్ జర్మనీకిచెందిన యి
ప్రొఫెసరు 86 మంది ఆడ ఖయిదీలను పరామర్శిం
తేల్చారట—స్త్రీణాం ద్విగుణమాహారం, బుద్ధిశ్చ
చతుర్గుణం.

**మేలుచేయబోతే కీడు!**

బొంబాయి కఫ్ పరేడ్‌కు చెందిన 26 ఏళ
పుష్ప అరుణ్ కుమార్ కారియా అనే ఆమె ఆగస్
పదవ తేదీన వైల్ పార్లేలో వుంటున్న తన స్నేహిత
రాలింటికి వెళ్లి, ఆ రాత్రి తనను వాళ్ళింట
పడుకోనివ్వమనీ, తెల్లారి తాను నానావతి హాస్పటలు
వెళ్లాలనీ చెప్పిందట. ఆ స్నేహితురాలు సమ్మతిం
నరికి ఆ రాత్రి పడుకుని, తెల్లారి లేచి స్నేహితురా
పడగ్గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకున్నట
మార్చుకుని 38 వేల రూపాయల ఖరీదు చేసే నగ
ఎత్తుకు చక్కాపోయిందట. పోలీసులు యి
రిపోర్టు అందుకుని పరుగులెడితే పుష్ప బోరివి
క్లబ్‌లో దొరికిందట. ఆ నగల్లో కొన్ని ఆమె వద్ద
మరి కొన్ని మార్వాడీవద్ద దొరికాయట. ఆమె నర
ప్రవర్తన కలిగినది కాదని, భర్తను రెణ్ణెల్ల క్రిత
వదిలి స్వేచ్ఛగా వ్యక్తుల వెంట తిరుగుతోందని
పోలీసులు కనుగొన్నారట— స్త్రీ సాహసమున నెద్ది!

**పన్నులు కట్టవలసిన వ్యాను!**

కర్ణాటక రాష్ట్రానికి చెందిన మండ్యలోని వ
బ్యాంకు వ్యాను యింటిలో లెక్కలకు తేలని డబ్బు
వో లక్షా పదహారువేల రూపాయలు ఆదాయ
లెక్కలవారికి దొరికిందట. వంటింట్లోని పొగ
గొట్టంలో యీ డబ్బు భద్రంగా దాచుకున్నాడట
వ్యాపారిగారు. అప్పటికే ఆయనగారు ఆదాయం పన్ను
ఐదువేల రూపాయలు పన్ను కట్టే కోవకు చెందిన వాడట.

**పురుషుణ్ణి స్త్రీగా మార్చటం!**

బెంగుళూరలోని విక్టోరియా ఆసుపత్రి
డాక్టర విరల్ అనే ఆయన వో ఇరవై యేళ్ళ
య వకణ్ణి శస్త్ర చికిత్స ద్వారా స్త్రీగా రూపొ
దిస్తున్నారట రెండ దశ శస్త్ర చికిత్స చేయా
ట మొదటి దశ శస్త్ర చికిత్సలో ఆ య వకుని
పురుషాంగాన్ని తొలగించారట వో నెల తర వాత
చే రెండవ దశ శస్త్ర చికిత్సలో యోని నిర్మాణ
రు ఆ దీ ఆ తర వాత ఆ య వక డు న వూ

ర్ణంగా స్త్రీ రూప, గుణ ధర్మాలు పొందుతాడని విరల్ విశదీకరించారట ప్రతివారికి సహా కాలం పురుషదశ, మిగతా సహాకాలం స్త్రీ దశ వుంటే కెనెంజాయ్ బోర్డ్డ్ లైవ్స్!

**సినిమాలు లేకపోతే జనాభా పెరుగుతుందా!**

ప్రతి ఆటకూ ప్రభుత్వానికి హాలువాళ్ళు కట్ట వలసిన పన్నును తమిళనాడు ప్రభుత్వం విపరీతంగా పెంచినందువల్ల రాష్ట్రంలో వున్న సినిమాహాళ్ళన్నీ ఆగస్టు 15 నుంచి మూతపడ్డాయి సామాన్య మానవుని ఏకైక వినోదమైన యీ సినిమాల మీద యింత అమానుషంగా పన్ను పెంచడంవల్ల యీ వినోదం కూడా పోతుందని, యీ కారణగా రాష్ట్రంలో "జనాభా పెరుగుదల" జరిగే ప్రమాదం వుందని, వెనకటికి యునైటెడ్ స్టేట్స్‌లో కూడ వో సందర్భంగా జనాభా పెరిగి పోయిందని లెజిస్లేటివ్ కౌన్సిలులో స్వతంత్రకు చెందిన సి మినాథన్ అన్నారట

**పెట్రోలు శక్తిని పెంచే తులసి!**

ఒక లీటరు పెట్రోలులో ఇరవై చుక్కల తులసి ఆకుల రసం గనుక కలిపి స్కూటరులో పోస్తే మామూలు పెట్రోలు కన్నా యిది మరో పది కిలో మీటర్లు ఎక్కువ యిస్తుందట ఈ విష యాన్ని పూనా విశ్వవిద్యాలయం కెమికల్ సొసైటీ కనుగొన్నదట—తులసీ మహాత్యం!




**ధర పెరిగినా సరుకు దొరుకుతోందిట!**

గత ఏడు నెలలలో తమిళనాడు ప్రభుత్వం 62 లక్షల రూపాయల విలువ చేసే బియ్యాన్ని చీకటి బజారు నుంచి బయటికి లాగిందట అంతేగాక అనధికారంగా యితర రాష్ట్రాలకు తరలింపబడు తున్న 11 లక్షల రూపాయల విలువైన బియ్యాన్ని కూడా పట్టేసిందట బియ్యం దొరక్క పోవడమనేది తన రాష్ట్రంలో లేదని, ఎటొచ్చీ ధర మాత్రం కాస్త ఎక్కువగా వుందని ముఖ్యమంత్రి కరుణా నిధి అన్నారట పడి బియ్యం ఆరు రూపాయలకు దొరికినా సంతోషించాలనా!

**మామూలుకోసం బిడ్డనమ్మిన నర్సులు!**

బెంగుళూరులోని వో కార్పొరేషను ఆసుపత్రిలో ప్రసవించిన ఒకామె నర్సులకు మామూళ్ళు యివ్వ లేదన్న కోపంతో అక్కడి నర్సులు ఆమె పక్కలోంచి ఆ పసికందును తస్కరించి యిరవై రూపాయలకు అమ్మి డబ్బు చేసుకున్నారట అదృష్టం కొద్దీ సమ యానికి పై అధికారులు రంగంలోకి వచ్చి ఆ పసి గుడ్డును వెతికి తెచ్చి తల్లికిచ్చేసి నర్సులను సస్పెండు చేశారుట దట్సనా టెనస్!

## గణేశ్ గీత

పురాణం అంటే పురాతనమైనది పురాణాలన్నీ బ్రహ్మ ముఖం నుండి సృష్టింపబడ్డాయని అంటారు మొట్టమొదట ఒకే పురాణం ఉండేదని, రాను రాను మహా పురాణాలు, ఉప పురాణాలు, అతి పురాణాలు, పురాణాలుగా విభజింపబడ్డాయని అంటారు

గణేశ పురాణం అట్టి పురాణాల కోవకి చెందినది గణేశ ఉపాసకులకి ప్రాణప్రదమైనది ఇందులో వినాయకుడు ఆది దేవుడుగా ప్రణవ స్వరూపుడుగా, సమస్త దేవతలూ ఎప్పుడూ ఆరాధిస్తారని, సృష్టి ఈయన ఆజ్ఞ వల్లనే జరిగిందని, పంచభూతాలూ ఆయన కనుసైగ ననుసరించి నడుస్తాయని వర్ణింపబడింది ఈ గ్రంథం రెండు ఖండాలుగా ఉంది మొదటిది ఉపాసనా ఖండం ఇందులో 92 అధ్యాయాలతో 4093 శ్లోకాలు ఉన్నాయి రెండోది క్రీడా ఖండం ఇది 155 అధ్యాయాలు కలిగి 11079 శ్లోకాలు గలిగి ఉంది

మొదటి ఖండంలో రుక్మాంగద, త్రిపురాసుర వృత్తాంతం, గణేశ సహస్ర నామస్తోత్రం, గణేశ వ్రతం, సంకష్ట చతుర్థి వ్రతం, అంగారక చతుర్థి వ్రత విధానాలు ఉన్నాయి రెండోదానిలో గజాననుడు భూమిపై అవతరించిన పుణ్య కథల వర్ణన, బాల లీలలు, రాక్షస సంహారం, అనుగ్రహానికి పాత్రులవడానికి భక్తులకు నిగూఢ రహస్యములు తెలియజేయబడ్డాయి

ఈ పురాణంలో "గణేశ గీత" ఉల్లేఖనీయమైనది గణేశుని ముఖతః వెలువడిన ఇది అతి పవిత్రమైనది ఇందులో కర్మయోగం, జ్ఞానయోగం, కర్మసన్యాస యోగం, యోగాభ్యాసాల్ని వర్ణిస్తూ, బుద్ధి, ఉపాసన యోగాలు వివరింపబడ్డాయి రాజయోగం గురించి సవిస్తరంగా ఉంది

గణేశ పురాణం చివరలో కలియుగంలో జరిగే అధర్మాలు, అరాచకాలు గురించి వివరణ ఉన్నది కలియుగాంతంలో గణేశుడు "ధూమకేతువు"గా అవతరించి పాప వినాశనం చేసి ధర్మాన్ని ప్రతిష్ఠిస్తాడని తెలుపబడింది

భృగు మహర్షి ఈ పురాణ కథని సౌరాష్ట్రకి చెందిన దేవనగర మహారాజా సోమకాంతుడికి వినిపించగా కుష్ఠువ్యాధితో బాధపడుతున్న ఆ రాజు ఆరోగ్యవంతుడైనాడని ఈ పురాణంలో చెప్పబడింది

— ఇటిక్యాల మాణయ్య

---

## వారఫలం

మహేష్

20-9-1974 శుక్రవారం మొదలు
26-9-1974 గురువారం వరకు

**మేషం :—** వ్యాపారంలో శ్రమ కలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు దైవ కార్యాలు నెరవేరతాయి

**వృషభం** —ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో ముఖ్యమయిన వ్యక్తులను కలుసుకుంటారు వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి అనవసరమైన వ్యయం చేస్తారు

**మిథునం** — మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి పోటీవారితో మాటపట్టింపులు తగవు రావలసిన డబ్బు అందుతుంది ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది పుణ్యకార్యాలు చేస్తారు

**కర్కాటకం** —మీ ప్రయత్నాలు ఫలిస్తాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి అనవసరమైన సందేహాలు కలుగుతాయి వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలు జరుపగలరు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**సింహం** — మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి సాహసిక వ్యవహారాలు లాభించగలవు ఇతరుల నిమిత్తం మీరు




శ్రమకు గురికావలసి వస్తుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది బంధుమిత్రులను కలుసుకొంటారు

**కన్య :—** వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది మిత్రులకు సహాయం చేస్తారు స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగించగలదు విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**తుల** — మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది నూతన విషయాలను తెలుసుకుంటారు సాహసిక వ్యవహారాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది

**వృశ్చికం** — వృత్తి వ్యాపారాలు బాగుంటాయి పోటీవారిలో గౌరవం లభిస్తుంది రావలసిన డబ్బు అందుతుంది ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి విలాస వస్తువులు కొంటారు

**ధనుస్సు** — కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వృత్తిలో ఆదాయం పెరుగుతుంది నూతన వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మకరం** — వ్యాపారంలో మీ ఆలోచనలు ఫలిస్తాయి నూతన విషయాలను తెల్సుకుంటారు వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలత లభిస్తుంది స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**కుంభం** — అధికారుల వలన జరగవలసినవ వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు వృత్తిలో ఆదాయం పెరుగుతుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ఫలితం దక్కకపోవచ్చును స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది అధిక వ్యయం జరుగుతుంది

**మీనం** — వృత్తిలో అనుకూల వార్తలను వింటారు విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి దైవకార్యాలు నెరవేరతాయి మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి మిత్రుల సహాయం లభిస్తుంది స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు పోటీవారిలో గౌరవం బాగుంటుంది




చైత్రమాసపు తొలి రోజులు అప్పుడే ఎండలు చుర్రు మంటున్నాయి ఎండల వేడికి భయపడి రోడ్డు మీద ఎక్కడా నరసంచారం లేదు

అప్పుడే హైదరాబాదు నుంచి వచ్చిన బస్సు స్టేజిలో వచ్చి నిలిచింది చేత సంచీ పుచ్చుకుని బస్సు దిగిన రామనాదంగారు కాలు భూమి మీద పెట్టగానే అబ్బా' అనుకున్నారు ఇంత ఎండలో ఇంటికి వెళ్లాలంటే ఆయన ముసలి ప్రాణం వుసూరంది సందు మలుపు తిరిగి

*నాలుగడుగులు వేస్తే ఇల్లు వచ్చేస్తుంది మళ్ళీ ఈ కాస్త దూరానికి రిక్షా అంటే అర్ధరూపాయికి తక్కువ తీసుకోడు ఎందుకొచ్చిన దండగ! నాలుగు అంగలు వేస్తే పోయేదానికి*

ఆయన బట్టతల మీద ప్రఛండగు ఐన ప్రతాపాన్ని చూపించాడు అప్రయత్నంగా చేసంచీ తలమీద అడ్డం పెట్టుకున్నారు రామనాధంగారు

ఆయనకి ప్రయాణాలంటె మహా విసుగు! కాని ఎంత కాదనుకున్నా ఈ మధ్య ఇటువంటి అర్ధాంతరపు ప్రయాణాలు రెండు నెల్లకొక సారి అయినా వెయ్యాల్సి వస్తోంది ఆడపిల్లల్ని కన్నందుకు తప్పుతుందా మరి!

గబగబా వీధి గుమ్మంలో నుంచుని "అమ్మాయు లనూ" అంటూ తలుపు తట్టారు చదువుతున్న వీక్లీతో సహా వచ్చి తలుపు తీసింది అనూరాధ "అమ్మా! నాన్న వచ్చారు" అంటూ ఓ కేక కూడా పెట్టింది రామనాథం సంచీ బల్లమీద పెట్టి, ఉత్తరీయంతో మొఖం తుడుచుకుంటూ కుర్చీలో చేరబడ్డారు

"ఉష్ ఏం ఎండలు తల్లీ! అప్పుడె మండించేస్తున్నాయి" అన్నాడు

"అవున్నాన్నా! రిక్షాలో రాకపోయ్యారా" అంది అనూరాధ ఇంతలో సుభద్రమ్మ మంచినీళ్ల గ్లాసుతో సహా హాల్లోకి వచ్చింది

"మీరు పొద్దున్నే వస్తారనుకున్నాం! ఇంత ఎండలో రాకపోతే ఓ గంట ముందో వెనకో రాకూడదూ" అంది సుభద్రమ్మ

'ఆ మన ప్రేమకి అక్కడ బస్సులు కాచుక్కూర్చుంటాయను కున్నావా?"

"అలా ఎవరన్నారూ? అయినా విస్సనె వస్తానన్నారుగా" అంది

"పని వెమల్లేదు అదీగాక మీ అన్నయ్య వూళ్ళో లేడు" అన్నాడు తల్లీ తండ్రీ సంభాషణలోకి దిగటం విని చల్లగా పక్కకి జారుకుంది అనూరాధ

"వెళ్ళిన పని ఏమయింది" అంది వుండబట్టలేక

"ఏమవటాని కేముంది? డెబ్బయినా డబ్బు ముఖ్యం వాళ్ళు రేపు పన్నెండుని చూసుకుందుకు వస్తామన్నారు" అన్నాడు

"పన్నెండనా! అంటే ఇవాళ ఎనిమిది ఇంక నాలుగు రోజుల కష్టమాట" అంది అంతలోనే అదిరికి మళ్ళీ నిస్పృహ ఆవహించింది ఏమిటో ఈ పెళ్ళి అయ్యేదెంతో కానిదెంతో, కాని ఈ పెళ్ళిచూపుల ఏర్పాటు ఎక్కువై పోతోంది వాళ్ళకి ఒక ప్రయాణం ఖర్చు ఫలహారాలు అంతా ఒక తతంగం ఇంత జరిగినా వాళ్ళు పిల్ల నచ్చిందనేవరకూ ఆరాటమే! పిల్ల నచ్చిందంటే సగం బరువు తీరినట్లే ఇంక తరువాతి కట్న కానుకల విషయం తాహతుని బట్టి వుంటుంది

ఈనాడు ఆడపిల్లల్ని కనడం మహా అపరాధంగా భావిస్తున్నారు దానికి అసలు కారణం ఈ వరకట్న పిశాచమే మగపిల్లలు వుద్యోగాలు చేసి సంపాదిస్తూ పెళ్లి చేసుకుని తండ్రి ఆస్తికి ఇంకా కట్నం జతచేస్తారు కాని ఆడపిల్లలు దీనికి పూర్తి విరుద్ధం! వాళ్ళు ఒక్కొక్క ఏడాది పెరుగుతున్న కొద్దీ తల్లిదండ్రుల గుండె కుంపటి రాజుకోవటం మొదలు పెడుతుంది చదువులు చెప్పించే స్తోమత వున్నదు చెప్పించినప్పట్నుంచి అంతకంటే పెద్ద చదువు చదివిన వాళ్ళని తెవాలి ఆ బాధలు పడలేక చదువులు మాన్పిస్తున్నారు కష్టపడి చదివించినా ఉద్యోగాలు చేసి సంపాదిస్తారన్న ఆశలేదు ఎన్నాళ్ళని ఆడపిల్లలసొమ్ము తింటారు ఒకవేళ ఆడపిల్ల ఉద్యోగం చేసినా పరువు ఎక్కడ బజారుపాలు అవుతుందోనని భయం అందుకే ఇన్ని బాధలు పడలేక హైస్కూలు చదువుకొ మాన్పించి గంపెడు పిగ్గ బొంత అప్పట్నుంచి ముడిపెడుతున్నారు




రెండుపూట్లా ఇంత తినటానికే చాలీ చాలని సంపాదనలు ఇంక అదనంగా కట్న కానుకలు ఇవ్వాలంటే తట్టా బుట్టా అమ్మాల్సిందే! అదీ లేని వాళ్ళగతి అధోగతే!?

మనదేశాన్ని పరిపాలించేది స్త్రీ అయివుండి ఇటువంటి సమస్యలకి పరిష్కారం ఎందుకు చెయ్యటంలేదోనని ఆలోచిస్తుంది సుభద్రమ్మ

అసలు కట్నం మాట అటువుంచి అనూరాధకి ఆ సంబంధం దొరకటమే దుర్లభంగా వుంది రావటానికయితే ఇప్పటికి ఐదారుగురు వచ్చి చూసివెళ్లారు కొందరు నచ్చిందన్నారు మరికొందరు నచ్చలేదన్నారు ఏ చ్చు కున్న వాడికి కోరిన కట్నం ఇవ్వటం రామనాధంగారి వల్ల కావటంలేదు

డిగ్రీ చదువు చదివిన వాడికి నాలుగువేలు అక్కడ పెట్టాల్సిందే ఇంకా అదనంగా ఇల్లూ వాకిలీ, మంచిరాబడిగల ఉద్యోగం అయితే ఆరెడువేలపైమాటే ఏ చదువు ఉద్యోగం లేకపోయినా మగవాడయినందుకె రెండు వేలయినా అక్కడ పెట్టక తప్పదు ఇవికాక యితర లాంఛనాలు పెళ్లిఖర్చు వెరె వుండనేవున్నాయి స్తోమతని బట్టే పుస్తెంతలో అల్లుడికి కట్న కానుకలు ఇవ్వటంలో తప్పలేదు శక్తికి మేర ముచ్చట్లు జరపవలసిందే కాని ఏమీ లేనివాళ్లల్లో కూడా ఈ పద్ధతులు ఆచరణలో వుండి ఆక్షేపణకి గురి అవుతున్నాయి ఇంత శ్రమపడినా తీరా పిల్ల అత్తవారింటికెళ్లి సుఖపడుతుందో లేదోనన్న సంగతి 'లాటరీ అదృష్టం' లాంటిదే!

రామనాధంగారు ఒక పెద్ద ఫీ లో చిన్న తరహా గుమాస్తా ఒక్కరూపాయిగూడా పై

## లాలస

రాబడిలేని ఉద్యోగం కాకపోతే ఆయన సర్వీసునిబట్టి నాలుగువందలపైచిలుకు వస్తుంది ఒకపాటి డాబా ఇల్లు వున్నవూళ్లోనే మూడెకరాల మాగాణి వుండబట్టి పెళ్లాం పిల్లలకి కడుపునిండా తిండి పెట్టగలుగుతున్నారు కాని ఇప్పటికే ముగ్గురు ఆడపిల్లలు ఎదిగి కూర్చున్నారు నాలుగవది తయారవుతోంది వీళ్లగాక ఇంకా ముగ్గురు మగపిల్లలు వున్నారు

అనూరాధ ఆయింటి పెద్దపిల్ల మామూలుగా హైస్కూలు చదువు పూర్తి చేసింది తరువాతది లక్ష్మి దానికి మేనరికం వుంది తరువాత సుందరి, శోభ! వీళ్లకి మళ్లా బయట చూడాల్సిందే రమణ అనూరాధ తరువాతి వాడు ఇంకో ఏడాది పోతే చేతికి అందివస్తాడు ఇప్పుడు బి ఎస్ సి రెండవ సంవత్సరంలో వున్నాడు ఈ నలుగురాడపిల్లల పెళ్లిళ్లు ఎలాచేసి పంపిస్తానా అని తల్చుకుంటే రామనాథంగారికి మనసు బేజారయి గుండె దిగజారి నట్లనిపిస్తుంది

వున్నమాట చెప్పాలంటే రామనాథంగారి సంతానం బుద్ధిమంతులు చక్కటి కనుముక్కు తీరుతో కాస్త కూస్త అందమయిన వాళ్లు మంచి తెలివితేటలు కలవాళ్లు

పనిమనిషి కూడా లేదు అయినా ఆడపిల్లలు ఇంటెడు చాకిరీ చేస్తారు ఏ వేళా ఇల్లు శుభ్రంగా ముత్యాల్లాంటి చుక్కల ముగ్గులతో ఇల్లు కలకల్లాడుతూ వుంటుంది దానిక్కారణం సగం అనూరాధ శ్రద్ధ, పనితనమే!

అనూరాధ 'రవ్వ'లాంటి పిల్ల కళ్లున్న మగవాడు ఆ పిల్లని మెచ్చి తీరాలి కాని ఇప్పుడు వద్దన్న పెళ్లికొడుకులంతా కళ్లులేక కాదు మనసులేక! డబ్బుమీద వ్యామోహం చంపుకోలేక!!

చీకటిని చీలుస్తూ వెలుగురేఖలు నలుదిక్కుల పరుచుకుంటున్నవి. నలుపు తెలుపుల కలయికతో ప్రకృతి వెలా తెలా పోతున్నది

సుభద్రమ్మ లేచి కూర్చుని మెళ్లోని మంగళ సూత్రాలు కళ్లకద్దుకుని పక్కమంచం దిగింది. భర్త పాదాలు రెండు చేతులా కళ్లకు అద్దుకుని, గదిలోంచి బయటికి వచ్చింది.

పక్కగదిలో లైటు వెలుగుతున్నది రమణ లేచి చదువుకుంటున్నాడు అతనికి ఫిజిక్సు ఓ పట్టాన బుర్రకెక్కదు పగలు రాత్రి సాధన చెయ్యవలసిందే! అతనిలోని సుగుణమేమిటంటే రాదు అనివదిలిపెట్టడు పట్టుగ పరిశ్రమచేసి సాధిస్తాడు 'విద్యార్థి'అన్నవాడికి ఆ మాత్రం పట్టుదల, సాధన లేకపోతే ఉన్నత విద్య కష్టసాధ్యమవుతుంది

రమణ గదిదాటి హాల్లోకి వచ్చిన సుభద్రమ్మ ఒక్క క్షణం బల్లదగ్గరే నుంచుండిపోయింది వరుసగా పక్కలు పరుచుకుని పడుకున్న పిల్లలంతా ఎటుపడితేఅటు పొర్లి ఒకళ్ల కాళ్ల వెంపు ఇంకొకళ్లతల, ఇంకొకరి నెత్తిమీద మరొకళ్ల చేతులువేసి అడ్డదిడ్డంగ పడుకున్నారు ఆడపిల్లలయితే మరీ అధ్వాన్నంగా వున్నారు 'పమిటలు' స్థానభ్రంశం పొందాయి లంగాలు మోకాళ్లపైకి పోయాయి చేతులు కాళ్లూ హాయిగా ఎటుపడితె అటు పడేసి పడుకున్నారు "ఇవాళో రేపో పెళ్లిఅయి అత్తవారింటి కెళ్లే పిల్ల ఈ అనూకి కూడా బుద్ధిలేదు ఆ రమణగాడు ఇటొచ్చినా అంతే కదా! ఛీ ఛీ ఛీ" అనుకుంటూ వెళ్లి అనూరాధ వీపు మీద ఒక్కటి చరిచింది అనూరాధ కయితే జాకెట్ హుక్కు అన్నివూడిపోయి లోపలి 'బ్రా' కనుపిస్తున్నది "లే మొద్దు కానా! ఏమిటా పడక" అంటూ అదిలించింది

"అబ్బా ఏమిటే మరీ" అంటూ మత్తుగా మూల్గి బద్ధకంగా ఒళ్లు విరుచుకుంది!

"ఆ ఇంకేం? ఆ అవతారానికి తోడు ఒళ్లు విరుచుకోవటం కూడానా! సిగ్గు లేకపోతే సరి ఒకసారి ఆ జాకెట్టు చూసుకో" అంది తల్లి

"నీ కెప్పుడూ ఇదే రంధి" అంటూ విసుక్కుంటూ జాకట్టు 'హుక్కు'పెట్టుకుని లేచి ఓణీ సరిచేసుకుంది పక్కచూస్తే ఒళ్లు తెలియకుండా నిద్దర పడుతుంది అనూరాధకి పగలంతా అవిరామంగా వుండటంతో రాత్రి పూట కంటినిండా నిద్రపోతుంది

బల్లమీది దువ్వెన చేతుల్లోకి తీసుకుని జుట్టు విప్పుకుని ఒకసారి గట్టిగ అల్లుకుని తల్లితోపాటు పన్లోకి దిగింది

పెరడంతా వూడ్చి చల్లి ముగ్గులు పెట్టింది. ఈలోగా సుభద్రమ్మ పొయ్యికింద నిప్పేసి నీళ్లకాగు పడేసింది ఆ రోజు

(32 వ పేజీ చూడండి)

అందమైన
ప్రతి ముఖం వెనుక
ఒక రమ్యమైన
రహస్యం
ఉన్నది.




అందంగా ఉండాలనుకోవటం మీ ఆశయం. మీ చర్మాన్ని ఆ విధంగా ఉంచు... క్రూక్స్ లాక్టో-కేలమైన్ పని

క్రూక్స్ లాక్టో-కేలమైన్ పగలు, సాయంత్రము, రాత్రి నిద్రపోయే ముందు ఉపయోగించండి. మీ కాంతి ఇనుమడించి, ఎల్లప్పుడూ వికసించి ఉండేలా చేయగలదని మీరు కనుగొంటారు.

క్రూక్స్
లాక్టో-కేలమైన్
లోషన్

డుఫార్ ఇంటర్‌ఫ్రాన్ లి
పోస్ట్ బాక్స్ నం 6582,
బొంబాయి 400 018,

## అందంగా ఉండటానికి సరిక్రొత్త రహస్యం

“మీరు కూడా ఒక ప్యాంటు కుట్టించుకోకూడదూ! ఆ రాజారావు వయస్సు మీకన్నా ఐదేళ్లు పెద్ద అయితేనేం, చక్కగా పాంట్లు వేసుకొంటాడు” సాధింపుగా భర్తతో అంది అనసూయ

“ఏమిటంటున్నావే!” ఆశ్చర్యపోయాడు సుబ్బయ్య

“మిమ్మల్నీ ఒక పాంటు కుట్టించుకో మంటున్నాను”

“బావుంది నీముచ్చట! ఈ వయసులో నాకు పాంట్లేమిటే?”




ఎస్. మల్లికార్జున

“మీరొకప్పుడు వేసుకన్నారు గనకనా! పెళ్లికీ పంచెలే! షష్ఠిపూర్తికి పంచలే!”

“అయితే ఇప్పుడేం అంటావు? పంచెల్లో నేను బాగోలేనా?”

“అని నేనన్నానా? ఒకసారి పాంట్ వేసుకోండి చూద్దామని ఉంది, అంటున్నాను”

“సరెలే నలుగురు నవ్విపోవడానికి”

“వాళ్ళపళ్లే బయటపడతాయి పండగకి మీరు పాంట్ కుట్టించుకు తీరాలి”

“చూద్దాంలే!”

అనసూయ వంటింట్లోకి వెళ్ళిపోయింది సుబ్బయ్య అలోచనలో పడ్డాడు నిజమే! తనొక పాంట్ కుట్టించుకోవాలి ఆ ముచ్చట తన కెన్నాళ్లగానో ఉంది తను పుట్టింది, పెరిగింది, పెరుగుతున్నది పల్లెటూరిలో, తన కాయం పేంట్ మొహం ఎరగదు ఎప్పుడూ పంచలే! అను పాంట్ వేసుకుంటే నడవ గలడా? కూర్చోగలడా? లేవగలడా? అన్ని సందేహాలే! అయినా పాంట్ ఒంటిని పట్టి నట్టుంటే అదో అందం ఆ అందము ఎంచెలకి ఎక్కడ నుంచి వస్తుంది పండగకి ఒకటి కొనుక్కుంటే సరి!

* * *

అనుకున్నట్టుగానే సుబ్బయ్య పట్నం వెళ్లి అందరి బట్టలతో పాటు తనూ ఒక నల్లని రంగు పాంట్ కుట్టించుకొని తెచ్చుకున్నాడు తేగానే ఎవరికీ చూపించలేదు గది తలుపు మూసుకొని తొడుక్కు చూసుకున్నాడు అంతా బాగానేఉంది! అయితే ఆ టైలర్ ఎలా కొలిచాడో గానీ పాంట్ మరీ నాలుగంగుళాలు పొడగయిపోయింది కొన్నించీలు తగ్గిస్తేనే కాని బాగుండదు మర్నాడే పండుగ మళ్లీ పట్నం వెళ్లిరాడానికి కుదరదు

సుబ్బయ్య పాంట్ విప్పేసి, మామూలు పంచే చుట్టబెట్టేసుకుని, పాంట్ చేతిలో పెట్టుకొని వంటింటివైపు వచ్చాడు

అనసూయ పొయ్యితో కుస్తీ పడుతోంది మండని పొయ్యిని మండింప, చేసే ప్రయత్నంలో ఆమెకళ్ల ఎర్రబారాయి గొట్టంతో “ఉఫ్” “ఉఫ్” మని ఊదుతూ పండగ కోసము పిండి వంటలు చేస్తోంది

“పాంట్ తెచ్చుకున్నానే కొంచెము పొడుగ

# సింథాల్ ఇచ్చే వాగ్దానం...

* నిత్య నూతన సౌరభం

* సంపూర్ణ లావణ్య పోషణ

* సార్థక దుర్గంధ నివార్య రక్షణ




...నిలబెట్టుకో కలిగింది సింథాల్ ఒక్కటే.

Interpub/GSC/11/74

యింది రెండంగుళాలు తగ్గించి కుట్టు" అంటూ గుమ్మంలోనే నిలబడ్డాడు సుబ్బయ్య

"బావుంది సంబడం ఒక పక్క నేను ఈ పొయ్యితోటే చస్తున్నాను" విసురుగా వచ్చింది జవాబు

"బాబ్బాబు! నీకు పుణ్యం ఉంటుందే! నువ్వేకదే పాంట్ కుట్టించుకోమని పోరింది ఇప్పుడిలా అంటే ఎలాగే? ఇంత పొడుగ్గా ఉంటే ఎలా తొడుక్కునేది"

"దానికీ ఒక వేళాపాళా లేదేమిటి? నా పెట్టెమీద పెట్టండి తీరికయితే కుడతాను"

సుబ్బయ్య పాంట్‌ని తీసికెళ్లి అనసూయ పెట్టెమీద పెట్టి, పొలానికి బయులుదేర బోతుండగా ఒక అనుమానం వచ్చింది అసలు అనసూయకి ఇవాళ తీరికంటూ అవుతుందా అని, ఒకవేళ కుట్టకపోతే తను మర్నాడు కొత్తబట్టలు ఎలా వేసుకొంటాడు? అతనికో మెరుపులాంటి ఆలోచన వచ్చింది

## ఇల్లాలి ముచ్చట

ముందుగదిలో ఏదో నవల చదువుకొంటూన్న కూతురితో "అమ్మ పెట్టె మీద నా పాంట్ ఉందమ్మా! దాన్నికాస్త రెండించీలు మడిచి కుట్టిపెట్టు" అన్నాడు

కూతురు మొహం చిట్లించింది "ఈ వయసులో నీకు పాంట్లు ఏమిటి నాన్నా! సరేలే, నన్ను డిస్టర్బ్ చేయకు ఈ నవల అయిపోవటం అవగానే కుడతాను" అంటూ మళ్లీ పుస్తక పరనంలో మునిగిపోయింది

సుబ్బయ్యకి అనుమానమే! నవల చదివింది రెండు పేజీలు, ఇంకా చదువవలసినది రెండుపుటల పేజీలు చివరికాయన పెరట్లో బట్టలుతుకుతూన్న కోడల్ని ఆశ్రయించారు "చూడమ్మ! మీ అత్తగారి పెట్టెమీద నా పాంట్ ఒకటుంది దాన్ని రెండించీలు తగ్గించి కుట్టిపెట్టు"

కోడలు చిన్నగా నవ్వింది "అలాగే లెండి మామగారూ!" తేలికపడ్డ మనసుతో పొలాని కెళ్లి పోయాడు సుబ్బయ్య

* * *

పండగపూట కొత్తపాంట్ తొడుక్కొని నలుగుర్లో నవ్వులపాలయ్యాడు సుబ్బయ్య అతని పాంట్ అతనికి పిక్కలదాకా వచ్చింది ఆడవాళ్లు ముగ్గురూ తమకు చెప్పిన పని తూచ తప్పకుండాచేసి మధ్యలో సుబ్బయ్యను ముంచారు నవ్వుల్లో కాదు నవ్వులమధ్య!




వినాయక చవితి సందర్భంగా పత్రిక పాఠకులకు నవ్వు తెప్పించే నాలుగు వాక్యాలు వ్రాద్దామని, అందుకు కావల్సిన మసాలా సూర్యకాంతంగారి దగ్గర దొరుకుతుందని తలచి, సరాసరి ఆవిడ ఇంటికి వెళ్లాను. నే వెళ్లేసరికి ఆవిడ ఏదో నెంబరు డయల్ చేసి దమ్ము త్రిప్పకోకుండా మాట్లాడుతూ వుంది. చడీ, చప్పుడు చేయకుండా ఆవిడకు కనపడకుండా కుర్చీలో కూలబడి, చెవులు నిక్కించి ఫోన్ సంభాషణం వినడం మొదలెట్టాను. ఎంత వూరుకుందా మనుకున్నా, నా నోరు నవ్వకుండా వుండలేకపోయింది. ఇంతకూ ఆవిడ ఫోన్ చేసిం దెవరికనుకున్నారు. సిద్ధి వినాయకుడికి. ఏం చర్చించిందో వినండి.

"హల్లో ! గుర్నా ! వినాయక్ ! వినాయక చవితి దగ్గర పడుతోంది. కానీ ఎప్పటిలా నీకు వుండ్రాళ్లు చెయ్యగలనా లేనా అనే సందేహం నన్ను పీడిస్తోంది. కారణం. ధరలు ఆకాశాన్ని అంటుతున్నాయి. పడి, కాదు కాదు శేరు బియ్యం ఎంతనుకుంటున్నావు ? మూడు రూపాయలను చేరుకుంటోంది. చెయ్యి పట్టుకున్నంత సైజు వున్న తిరపతి లడ్లు ఇప్పుడు ఒక్క చేతితో నాలుగు లడ్లు పట్టుకునేంత సైజుకు దిగాయి. చూచావా ! పరిస్థితు లెంత విషమించాయో ! కానీ నువ్వు మాత్రం వుండ్రాళ్లు వదిలేట్టు లేవు. నువ్వు వాటిని మర్చిపోయినా, నీ పేడు చెప్పకు తినడానికి నేను మాత్రం వాటిని చేయడం మర్చిపోను. సైజులో కాస్త మార్పు వస్తే రావచ్చు గానీ, నీ ఫీజు తప్పకుండా చెల్లిస్తాను. వుండ్రాళ్లు చిన్నవని కోప మొస్తుందా ! ఏం చేద్దాం మరి ! అందరితో పాటు నువ్వుకూడా నీ బొజ్జ సైజును కాస్త తగ్గించాల్సిందే. నీ చేజేతులా నువ్వే సరైన ఆరగింపు లేకుండా చేసుకున్నావు. ఏపుగా పెరుగుతున్న ధరల వైపు చూస్తేగా నీ కళ్లు. అర్థమైందిగా పరిస్థితి. తరుణోపాయం ఆలోచించు. తొందరగా తెములు. నీ శక్తులను ఈ దుష్ట శక్తులపై ప్రయోగించు. ఎప్పుడూ నవ్వుతూ వుండేట్టు మమ్ముల నందరిని దీవించు."

—శ్రీ వి వా క్

***

"చక్రవాకం"లో హాస్యం



"దీక్ష"లో హాస్యం



# పుత్తడి బొమ్మ

సీరియల్

రామవరపు వేణుగోపాలరావు

3

(గత సంచిక తరువాయి)

**బస్** స్టాండ్‌కి ఎదురుగా వున్న హోటల్లో కాఫీ తాగి నాలుగు రోడ్ల సెంటర్ దగ్గర నిలబడ్డాడు రవి వీరఘట్టం వెళ్ళే బస్సు చ్రు బ్రుమంటూ రివర్స్ అవుతున్నాది రాయగడ నుంచి వచ్చిన ఖాళీ లారీలు చెవులు చిల్లులు పడేలా హారను మోతల్తో గర్జిస్తున్నాయి దారికోసం నాలుగైదు సైకిల్ రిక్షాలు ఎంతకీ మాయమవని అవినీతిలా నిలబడి వున్నాయి, ప్రయాణికులకి అడ్డంగా అక్కడే పది పదిహేను కర్రల కావిళ్ళు వరసాగ్గా నిలబెట్టి వున్నాయి వాటి పక్కనే, గోచీగుడ్డల్తో, దీక్షగా ఎటో చూస్తూ నిలబడున్నారు వాటిని అమ్మజూపే గిరిజనులు వంకాయల కావిళ్ళు జనం మధ్య దారిని వెతుక్కుంటున్నాయి ఓ మూల — అక్కడే — రోడ్డుపక్క అయిదారుగురు సవరవాళ్ళు తలలు వొంచి జుత్తు కత్తిరింపించుకుంటున్నారు

వాళ్ళ ఆడవాళ్ళు కాబోలు ఒంటి పొర గుండారుల్తో, జాకెట్లు లేకుండా అక్కడే నిలబడున్నారు చిరిగిన చెడ్డీ వుండి మరేమీ లేని ఏడేళ్ల నల్లని పిల్ల జంగిడిలో ఈగలు ముసిరే జంతికల్ని, చుప్పుల్ని, ఎంతకీ కదలవేమా అని విడ్డూరంగా చూస్తున్నాది రకరకాల మనుషుల మాటల్తో ఆ ప్రాంతం అంతా నానా భీభత్సంగా వుంది తెల్ల బూట్లు వేసుకున్న లెప్రసీ వాడొకడూ, నల్లని కాన్వాస్ బూట్లు వేసుకున్న లెప్రసీ వాడొకడూ రవి మీదకి వచ్చేస్తున్నారు వాళ్ళ నుంచి జుగుప్సతో పక్కకి జరగబోయిన రవి, ఎవరో నడి వయస్సు ఆడదాని మీద పడినంత పని చేశాడు ఆవిడేం గొడవ పెడ్తుందో నన్న భయం గడగడలాడి కంగారుపడ్డాడు కాని, ఆమె ఏం జరగనట్టు మామూలుగా వెళ్ళిపోవడంతో 'అమ్మయ్య అని నిట్టూర్చేడు

అసలే ఇరుకు రోడ్లు

ప్రజలు మాత్రం ప్రళయ జల ప్రవాహంలా అటూ ఇటూ తిరుగుతున్నారు

రెండేళ్ల నాటి వూరికీ, ఈనాటి వూరికీ చాలా తేడా వుంది అనుకున్నాడు రవి ఆ రోజుల్లో సైకిళ్ళూ, రిక్షాలూ, ఎద్దుబళ్ళూ, అప్పుడప్పుడు మోటారు వాహనాలూ కనిపించేవి బజారు రోడ్డులో కాస్త నడవడానికయినా సందు దొరికేది ఇప్పుడో ? అలా కాదు రద్దీ పెరిగింది కొట్లు పెరిగేయి జీపులు కనిపిస్తున్నాయి జావాలు జుఁయ్ మంటున్నాయి కార్లు కిరకిర మంటున్నాయి అదనంగా మరో రెండు సినిమా హాళ్ళు పెరిగేయి కొత్త లాడ్జింగులు వెలిసేయి మత్తు పానీయాల విక్రయ శాలలు జిగేల్ జిగేల్మనే లైట్లతో వెలుగుతున్నాయి లౌడ్ స్పీకర్లు, మైక్ సెట్లూ భూనభోంతరాలు దద్దరిల్లేలా మ్రోగుతూ, వీధిన పోయే వాళ్లకి ద్వంద్వార్థాల పాటలు విన్పిస్తున్నాయి బెల్‌బాటమ్‌లు కొత్తగా కనిపించినా, పువ్వుల బుష్ షర్టులు ఎక్కువయ్యేయి వూరు కాస్త బాగానే పట్నం కంపు కొడ్తోంది

ఈ సందడిలో, ఈ రద్దీలో బెలగాం దాకా నడుచుకుపోవడం సంభవమే అయినా, తలనొప్పి వచ్చే ప్రమాదం ఎందుకు కొనితెచ్చుకోవడం అనుకుని, రవి రిక్షా ఎక్కేడు పద్మశ్రీ సినిమా హాలు దాటేవరకూ రిక్షా కుంటి నడకతోనే నడిచింది అక్కడి నుంచీ వేగం కొంచెం హెచ్చింది వేగం ఎక్కువౌతున్నకొద్దీ రవి ఆలోచనల్లోని ఏకాగ్రత పటిష్ఠం కాసాగింది

పార్వతీపురంలో తను చదువుకున్నన్నాళ్ళూ ప్రతిరోజూ బావగారింటికి అమ్మ వద్దన్నా వెళ్ళేవాడు అక్కతో మాటాడేవాడు అక్క కూతురు రజనితో ఆటలు ఆడేవాడు అప్పటి రజని మొహం గుర్తుకి తెచ్చుకోవడానికి ప్రయత్నించాడు రవి రజనిని ఆఖరిసారిగా చూసి అయిదేళ్ల పైచిలుకే అయింది అప్పటికి రజని పదమూడేళ్ల పిల్ల

> **జరిగిన కథ 2** సరస్వతమ్మ వ్యసనపరుడైన భర్త క్షయవ్యాధితో మరణించటంతో ఒంటరి దవుతుంది కులం కానివాడిని పెళ్లి చేసుకున్న కూతురు జానకిని వెళ్లగొడుతుంది 'లా' చదువుతున్న రవి, పెళ్లి చూపులకు పోవ నిరాకరించగా బాధ పడ్తుంది తల్లి వద్దంటున్నా అక్క జానకిని చూడాలని బయల్దేరతాడు రవి కంబారి పుల్లిగాణ్ని దారుణంగా హింసిస్తున్న గవరయ్య బుగతని ఎదిరించి పుల్లిగాడ్ని విడిపిస్తాడు ధర్మయ్య

ఏనాడో తన తల్లి వెలివేసిన అక్క యింటికే ఇప్పుడు వెళ్తున్నాడు అయిదేళ్ల తర్వాత వాళ్లని మళ్లీ యిదే చూడ్డం అక్క ఎలా వుందో ? బావగారెలా వున్నారో ? రజని రజనెలా ఉందో! ఈ అయిదేళ్లలో రజని చాలా మారి వుంటుంది పరికిణీ జాకెట్ల స్థానే చీరనీ వుంచి రజని రూపు వూహించుకుందికి ప్రయత్నం చేశాడు రవి చేతగాని ఫొటోగ్రాఫర్ తీసిన బొమ్మలా వెలవెలపోతూ కన్పించింది 'ఛీ ఛీ' అని మనసులో అనుకోబోయి పైకే అనేశాడు పెడల్ వేస్తున్న రిక్షావాడు 'ఏటి బాబూ ?' అన్నాడు నవ్వుకొని 'ఏం లేదులే నువ్వు పోనియ్ ?' అన్నాడు

చర్చి దాటేక ఓ పెంకుటింటి ముందు రిక్షా ఆపి దిగేడు రవి డబ్బులిచ్చి రిక్షాని పంపేసేక వీధి గడపలో నిలబడి తలుపు తట్టేడు తెరుచుకునే వున్న తలుపు కొంచెం ముందుకి జరిగింది తోసుకొని నెమ్మదిగా లోపలికి వెళ్లేడు ముందు నడవాలో నాలుగు కుర్చీలూ, చిన్న స్టూలూ వున్నాయి గుమ్మానికి నీలం రంగు కర్టెన్ వేలాడుతోంది లోపల ఎవరూ వున్న అలికిడే లేదు నడవాలో వున్న కుర్చీలో కూర్చుని ఏం చేద్దామా అని ఓ నిమిషం పాటు ఆలోచించేడు అయిదేళ్ల తర్వాత అక్కని చూడ్డానికి వచ్చిన తమ్ముడు ఏం చెయ్యాలి ?

"అక్కయ్యా!" అని గట్టిగా కేకేశాడు రవి

వెంటనే లోపల్నించి "ఎవరూ ?" అన్న కోమల కంఠం వినిపించింది ఆ గొంతు అక్కది కాదు బహుశా రజనిదై వుంటుంది రవి మనస్సు సంతోషంతో పరవశించిపోయింది లోపల మెత్తని అడుగుల చప్పుడు గాజుల గలగల గుమ్మానికి వేలాడుతున్న నీలం రంగు కర్టెన్ వేపే పరీక్షగా చూడసాగేడు

చటుక్కున తెర కదిలింది గుమ్మంలో రెండు చేపల్లాంటి కళ్లు మిలమిల్లాడేయి

ఆ కళ్లెవరివో రవికి తెలుసు ఆ కళ్లలో లకస్మాత్తుగా మెరిసిన మెరుపెందుకో తెలుసు రోజా రంగు బుగ్గల మీదికి అవ్యవధిగా అరుణిమ ఎందుకు వచ్చిందో తెలుసు! ఎర్రని పెదిమల చివర పుట్టి కంటి చివర్ల వరకూ పాకిన హాసరేఖ తళుక్కుమన్న దెందుకో తెలుసు గులాబీ రంగు వాయిల్ చీర ధరించిన సుందర తనూలతలోని హఠాత్ కంపనం ఎందుకో తెలుసు అన్నీ తెలిసికూడా వెంటనే పలకరించాలన్న ధ్యాస లేకపోయిందతనికి ఆ వూహ రాగానే చిరునవ్వు చిందిస్తూ 'ఓహో — రజనీ హౌ ఆర్ యూ ?' అందా మనుకున్నాడు

కాని అతను అలా అనేలోగానే —

అంతలోనే ఆమె లోపలికి తుర్రుమంది ఈసారి అడుగుల శబ్దం లోపల గబగబ పడింది "అమ్మా, మావయ్యొచ్చాడే!" అని సంభ్రమంగా అన్న మాటలు వినిపించేయి మరు నిమిషంలో అక్కయ్య ప్రత్యక్షమైంది చేతుల్ని పైటచెంగుతో తుడుచుకుంటూ ఆప్యాయంగా తమ్ముడి ముఖంలోకి చూసింది అను

కోని ఆనందం. ఆమెని తాత్కాలికంగా మూగదాన్ని చేసింది.

"నే నెవర్నో చెప్పుకోవాలి ?" అన్నాడు రవి.

"నాకు తెలుసులేరా వెధవా ! ఆ సంగతి ! నా యింటికి వచ్చే చుట్టం ఒక్కడే వున్నాడు... వాడు నా తమ్ముడు."

నవ్వుతూనే ఆమె ఆ మాటలు అన్నా రవికి అందులో చిన్న విషాదపు జీర వినిపించింది. 'ఛ. ఎందుకన్నానా ఆ మాట ?' అనుకున్నాడు. పశ్చాత్తాపంతో "సారీ అక్కయ్యా !" అన్నాడు.

"ఫర్వాలేదులేరా" అంటూ జానకి మెల్లిగా గుమ్మం దిగి తమ్ముడి పక్కనే కుర్చీలో కూర్చుంది. ఆమె కళ్లు తమ్ముడిని నఖశిఖ పర్యంతం పరీక్ష చేస్తున్నాయి.

"అవునుగానీ ఒరే తంబీ, నువ్వు హైదరాబాద్ నుంచి వచ్చి ఎన్నాళ్లయిందిరా ?"

"ఇవాళ పదకొండో రోజు"

"వూరిలో దిగిన యిన్నాళ్లకిగానీ నీకు అక్కయ్య జ్ఞాపకం రాలేదన్నమాట !" అంది నిష్ఠూరంగా.

"అక్కయ్యా, నువ్వు నీ తంబి వెధవని తప్పుడు అంచనా వేస్తున్నావు. వచ్చీరాగానే అమ్మ మేరంగికి తరిమింది. దగ్గిరుండి ధాన్యం బళ్లు తోలుకు రమ్మంది. మంచులో చలిలో తిరగడం పడక జ్వరం వచ్చింది. దాంతో అయిదు రోజులు మంచం ఎక్కేను. ఫ్లూ అన్నాడు డాక్టరు. ఇప్పటికీ యింకా ఒళ్లంతా నొప్పులుగానే వుంది. అదీ కథ. అందుకే రాలేదు..."

"పోనీలేరా ... యిప్పటికైనా వచ్చేవు. అదే పదివేలు. ఇప్పుడు నీకు ఒంట్లో కులాసాగానే ఉంది గదా ?"

"ఓ భేషుగా వుంది."

"అమ్మ ఎలా వుంది ? ఏమంటున్నాది ?"

"మామూలే. నీకు తెలీందేముంది ? నువ్వే చెప్పాలి అమ్మ గురించి నాకు..."

జానకి ఒక నిమిషంపాటు మౌనంగా వీధి గుమ్మంవేపు చూస్తూ వుండిపోయింది. తనకి మాత్రం ఏం తెలుసు ? వీధి గుమ్మం దిగి ఎన్నేళ్లు అయిందో !!

"అక్కా, ఈ అయిదేళ్లలో నువ్వు చాలా మారేవు సుమీ."

'అలాగా' అన్నట్టు చూసింది జానకి.

"అక్కడక్కడ నీ జుత్తు పండింది. కళ్లకి ళ్లజోడు వచ్చేసింది. ఈ రెండూ నిన్ను పూర్తిగా మార్చేసేయి." అన్నాడు రవి ఏదో కొత్త షయం కనిపెట్టినవాడిలా.

"నా సంగతి సరే. బావగార్ని రానీ చూద్దువు గాని. తలంతా నెరిసిపోయింది. ఇప్పుడు పంచెలూ లాల్చీలూ వేస్తున్నారు. అచ్చం తాతగారే. వాళ్ల స్కూల్లో కుర్రాళ్లెవరో 'గ్రాండ్ ఫాదర్' అని నిక్ నేమ్ కూడా పెట్టేసేరుట. ఆ మాటంటే ఆయనకి ఎంత కోపమో చెప్పతరం కాదనుకో..." అంది జానకి నవ్వు తెరల మధ్య.

మళ్లీ అంతలోనే — "అయినా మా యిద్దరికీ తక్కువ ఏళ్లనుకున్నావేమిటి ? ఇంకో రెండేళ్లు పోతే నాకు నలభై వస్తుంది. ఆయనకి ఏభై వెళ్తాయి. రజనికి పెళ్లయితే ఈపాటికి పిల్లలు పుట్టేవారుకారా, ఆయన తాత అయ్యేవారు కాదా ? పిచ్చిగానీ ... రజని మాత్రం చిన్నపిల్లా యేమిటి ? దానీడు పిల్లలు ఎంతోమందికి పెళ్లిళ్లయి ఎంచక్కా పిల్లల్ని కూడా కన్నారు..." అంది.

"అన్నట్టు — రజని యేది ?"

"నువ్వింకా దాన్ని చూడలేదూ ?"

"ఊహూఁ. లేదే."

"రజని ... ఒసే అమ్మలూ !" అని బిగ్గరగా పిలిచింది జానకి.

"ఓయ్" అన్న మాట గుమ్మంలోంచి వినిపించింది.

"దొంగ భడవా ! ఇదింతసేపూ గుమ్మం దగ్గరే వుంది చూసేవా ?" అంది రవితో ఆశ్చర్యంగా. "రావే, మావయ్య దగ్గర సిగ్గేమిటే నీకూ ?"

"మావయ్య దగ్గర నాకు సిగ్గెందుకు ?" అంటూ ప్రత్యక్షమైంది రజని. అడుగులో అడుగు వేసి నడుస్తూ తల్లి పక్కనే వున్న కుర్చీలో కూర్చుంది. కూర్చున్నాక ఎదురుగా వున్న రవివి సూటిగా చూస్తూ "...అసలు మావయ్యే నాదగ్గర సిగ్గుపడాలి ... !" అంది.

"నేనా ? ఎందుకూ ?"

"ఎందుకా, చెప్తా. నువ్వు మా యింటి కొచ్చి ఎన్నాళ్లయింది ?"

రవి ఆలోచించేడు. మనసులోనే లెక్కపెట్టి— 'అయిదు సంవత్సరాల ఏడు నెలల చిల్లర అయింది...' అన్నాడు.



''ఇన్నాళ్ళుగా రాకపోవడానికి కారణం ఏమిటి?''

''లేకపోలేదు వుంది ''

''ఏమిటది ?''

''చెప్పక తప్పదా ?''

''బలవంతం ఏమీ లేదు''

''సరే చెప్తాను విను నాకు అమ్మా, నీకు అమ్మమ్మా అయిన సరస్వతీదేవమ్మగారి ఆజ్ఞ నా చేత ఒట్టు వేయించుకొంది నేను మీ ఇంటికి వస్తే, తను చచ్చిపోయినంత ఒట్టు అంది ''

''ఓహో – తమరు తల్లి మాట జవదాటని అపర శ్రీరామచంద్రులు అన్నమాట!''

''అంతేకాదు, యింకా కారణా లున్నాయి ''

''కానీండి సార్, చెప్పండి ''

''ఈ అయిదేళ్ల కాలంలోనీ నే నొక్కసారే ఈ వూరొచ్చేను అప్పుడు మూడంటే మూడే రోజు లున్నాను ''

''అబద్ధం''

''కాదు నిజం! కావాలంటే అక్కయ్యని అడుగు ఏం అక్కయ్యా ?'' అంటూ తన వాదనకి సపోర్ట్ కోసం జానకి వంక చూశాడు రవి

ఆమె ఏదో చెప్పబోయేలోగానే రజని రివ్వున లేచి నిలబడింది చిరుకోపంతో రవి వేపు చూసింది ''ఆహాహ ఎలక్కి పిల్లి సాక్ష్యంట! ఆవిడగారేం చెప్పనక్కర్లేదు నువ్వు చెప్పు'' అంది

''నేను నిజమే చెప్తున్నాను నువ్వు నమ్మక



## పుత్తడి బొమ్మ

పోతే నేనేం చేసేది ?'' అన్నాడు రవి నిస్పృహయంగా

''పోనీ, ఆ మూడు రోజుల్లో ఒక్కసారైనా ఎందుకు రాలేదు ? మా ఇల్లు మీ యింటికి ఎంత దూరంలో వుందనుకున్నావ్ ? అక్కడ రిక్షా యెక్కి యిక్కడ రిక్షా దిగితే మహా అయితే నలభై పైసలు అంతేగా!''

ఆవేశంతో రజని మెడ దగ్గర నరాలు ఆకాశ నీలం రంగులో పొంగడం ఓరకంట గమనించాడు రవి

''నేను వద్దామనే అనుకున్నాను మీరు అప్పుడు వూళ్ళో లేరు అక్కా బావా నిన్ను మెడికల్ కాలేజిలో చేర్పించడానికి విశాఖపట్నం తీసుకు వెళ్లేరు ''

''అవునే రజనీ మనం ఆ మాట అనుకున్నాం కూడానూ నీకు జ్ఞాపకం లేదూ ?'' అంది జానకి కూతుర్ని చూస్తూ

''పోనీ – అలాగే అనుకుందాం మరైతే ఈ అయిదేళ్లలోనీ నువ్వొక్కసారే ఈ వూరు రావడానికి కారణం ఏమిటి ?'' అంది మొండిగా

''నాకు హైదరాబాద్‌లో ఏ హాస్టల్లోనీ సీలా సీటు దొరకలేదు నల్లకుంటలో చిన్న ఇల్లు అద్దెకి తీసుకొని వుంటున్నాను అమ్మకీ సంగతి తెలుసు నాకు సెలవు లిచ్చినప్పుడల్లా అమ్మ నన్నిక్కడికి రావొద్దని రాసి, తనే అక్కడికి వచ్చేసేది సెలవు లన్నాళ్ళూ అక్కడ వుండి మళ్లీ తను ఒక్కర్తీ యిక్కడికి వచ్చేసేది మరి నాకు అవకాశం ఏదీ ? ఈలోగా ఏడ్చి, బతిమాలి, గీపెట్టి, అమ్మచేత ఒట్టు తీసి గట్టున పడేయించేను తెలుసా ?''

రవి చెప్పింది విని రజని ఏం మాట్లాడలేదు నేల చూపులు చూస్తూ బుంగమూతి పెట్టుకుని కూర్చుండిపోయింది జానకి ఆప్యాయంగా కూతురి తల నిమురుస్తూ ''అబ్బ ఎంత కోపమే నీకూ ? రాక రాక మావయ్య వస్తే నవ్వుతూ పలకరించాలిగానీ, సవాలక్ష ప్రశ్నలు వేసి వేధిస్తారుటే —?'' అంది

దానికీ రజని మాట్లాడలేదు ఒంచిన తల కూడా ఎత్తలేదు

''అన్నట్టు — బావగారేరే అక్కా ?'' అన్నాడు రవి

''స్కూలు నుంచి ఆయన వచ్చేటప్పటికి ఒంటిగంటవుతుంది ఇవాళెంచేతో వేగిరం వచ్చేస్తానన్నారు కూర్చో కాఫీ పట్టుకొస్తాను'' అంటూ లేచింది జానకి

''ఇప్పుడు కాఫీ గీఫీ ఏం వద్దక్కా బజార్లో తాగే వచ్చేను కూర్చో చక్కగా కబుర్లు చెప్పుకుందాం'' అన్నాడు రవి ఆమెను వారిస్తూ

ఆ మాటలు విన్న జానకికి 'రవి' జ్ఞాపకాని కొచ్చేడు అప్పుడూ ఇలాగే అనేవాడు రాత్రి నిద్ర పట్టేవరకూ కబుర్లూ, కథలూ, కాకరకాయలూ చెప్పమని వేధించేవాడు ప్రారంభించిన పావుగంటకే గాఢ నిద్రలో మునిగిపోయేవాడు ఏ కారణంగానైనా ఒక్క రోజు కథ చెప్పకపోతే వెక్కి వెక్కి ఏడిచేవాడు

''మరోసారి తాగితే కొంపేం మునిగిపోదులేరా మీ రిద్దరూ మాట్లాడుకుంటూ వుండండి నిమిషాల్లో కాఫీ చేసి తీసికొస్తా ''

''పరాయి ఇళ్లల్లో కాఫీ గీఫీలు తాగొద్దని వాళ్లమ్మగారు నిషేధాజ్ఞలు జారీ చేశారేమోనే అమ్మా!'' అని రజని వేళాకోళం చేసింది

''నువ్వుండవే మరీనూ —'' అని జానకి కూతుర్ని మందలించింది

''ఎందుకేనా మంచిది 'అమ్మకూచి' గారికి పాలో, హార్లిక్సో ఇయ్యి నాకు మాత్రం స్ట్రాంగ్ కాఫీ కావాలి '' అంది రజని రవి వంక చిలిపిగా చూస్తూ

జానకి నవ్వుకుంటూ ఇంట్లోకి నడిచింది

[ ఇంకా వుంది ]



మరో అయిదింటిలో రంగనాథ్ గట్టి పాత్రలనే పోషి స్తున్నాడు అందరిచేతా సెహభాష్ అనిపించు కొంటున్న యీ వర్ధమాన నటుడికి ఒక చిన్ని సలహో

అందరూ గొప్పగా చెప్పుకొంటున్నారు గదా అని, అన్నీ తెలుసు అనుకొని ప్రవర్తించవద్దని, నేర్చవలసినది చాలా వున్నదనుకుంటూ జీవితంలో మధుర ఘట్టాలను చవిచూచే అదృష్టాన్ని అనుభ వించమని కాంక్షిస్తున్నాను.

## సత్యం - సంగతులు !

ఈమధ్య ఒక వారంరోజులు ఆంధ్రదేశం వెళ్లినప్పుడు, నేను చెవులారా విన్న కొన్ని నిజాలను యిక్కడ వివరిస్తున్నాను.

సురేష్ మూవీస్ వారి "చక్రవాకం"పై మోజు పెంచుకొన్నారు. కారణం ఏమిటని కొంద రిని అడిగాను. "సురేష్ సంస్థ నిర్మించే చిత్రాలు రమణీయంగా వుంటాయట. భారీ సెట్టింగులు, మధురమైన సంగీతం, మేధావుల సాంకేతిక ప్రాభవం కనిపిస్తాయిట. కథను జనరంజకంగా చెప్పే దర్శకుడు వుంటాడట. అగ్రశ్రేణి నటీ నటులు పోటాపోటీగా నటిస్తారట." ఈ కారణాల చేత "చక్రవాకం" ప్రేక్షక—జన ఆమోదం పొంద గలదట. వాళ్లన్న సంగతులు విన్న నాకు సత్యం పలికారు అనిపించింది.

చక్రవాకం నవలకు పాపులారిటీ వుంది. సురేష్ రామానాయుడికి ప్రజలపై గ్యారంటీ ఉంది. ఇక నటించిన శోభన్‌బాబు, వాణిశ్రీ, రంగారావు, అంజలీదేవి, నాగభూషణం, జి. వరలక్ష్మి, పద్మ నాభం, రాజసులోచన, రామానాయుడు, కృష్ణ కుమారి మరియు రాజబాబు ప్రజలకు ఎంత ఆప్తులో తెలియదా? వాళ్ల నటనా ప్రాభవాన్ని సంశయించని సంస్కారం ప్రేక్షకులకు వున్నది. మహదేవన్, మార్కస్‌బార్‌ట్లే, కృష్ణారావు, మార్తాండ్ లాంటి ఉద్దండులు తమ వృత్తిపట్ల ఎంత ఉదాత్తంగా వుంటారో మాపరులకు తెలుసు. దర్శకుడు మధుసూదనరావు ఎంత నేర్పుగా చిత్రా లను రూపొందించగలరో ప్రజలకు తెలియదా. విక్టరీ బిరుదాన్ని విస్మరించి వ్యవహరించే మనిషి కాదు గాబట్టే విజయంపై విజయం చవి చూస్తున్నాడు.

*  *  *

జగపతి పిక్చర్స్ నిర్మించిన "మంచి మను షులు" చిత్రం గూర్చి ప్రేక్షకులు బంగారు కలలు కంటున్నారు. కారణం ఏమిటన. జగపతి రాజేంద్ర ప్రసాద్ గారి చిత్రాలలో రాజసం వుంటుందట. పాటలు మధుర మధురంగా వుంటాయట. మానసోల్లాసాన్ని కలిగించే మసాలా వుంటుందట. పెద్ద పెద్ద సెట్లు, భయంకరమైన ఫైట్లు, ఆనందపరిచే శృంగార ఘట్టాలు, నవ్వించే హాస్య ఘట్టాలు. చిత్రీకరణలో వేగం కనిపిస్తాయట. ప్రేక్షకుల నాడిని అర్థం చేసుకొన్న నిజం ఆయన చిత్రాలలో అగుపిస్తుందట.

వాళ్లు అన్న మాటలు సత్య దూరం కావు. భారీ చిత్ర నిర్మాణం చెయ్యడంలో సిద్ధహస్తుడు. మంచి కథను అందించడంలో సమర్థుడు. ప్రేక్షకు డిచ్చే డబ్బుకు న్యాయం చెయ్యగల నేర్పరి



"ఎవరికివారే యమునాతీరే"లో

"మంచి మనుషులు" చిత్రంలో వెంకటరత్నం ఛాయాగ్రహణ చాతుర్యాన్ని చెప్పనా, మహదేవన్ సంగీత సామర్థ్యాన్ని వర్ణించనా లేక రాజేంద్ర ప్రసాద్‌గారి దర్శకత్వ ప్రతిభను కొనియాడనా అన్న సందిగ్ధంలో పడ్డ నేను తీర్పు నిచ్చే అధి కారాన్ని ప్రేక్షకులకే అప్పగిస్తున్నాను. ఇక నటీ నటులు గూర్చి వ్రాయాలంటే ... శోభన్‌బాబు, జగ్గయ్య, నాగభూషణం, రాజబాబు, మంజుల, అంజలీదేవి, పోటీపడి నటించారనే చెప్పాలి. ముఖ్యంగా మంజుల నటన ప్రత్యేకంగా పేర్కొన తగ్గది. మాష్టర్ టిట్టో నటన సుపర్బ అనడం ధర్మం. ప్రజలు కంటున్న బంగారు కలలు వృధా కాని విధంగా "మంచి మనుషులు" తయారైంది.

## సత్యానంద్ రాసే చిత్రాలు !

"మాయదారి మల్లిగాడు" చిత్రం ఒక మంచి రచయితను అందించిన విషయం యిప్పట్లో మరచిపోలేని విధంగా సత్యానంద్ రాసిన మాటలు యిప్పుడు, ఎప్పుడు గుర్తుకొస్తాయి.

ఈమధ్య అతగాడ్ని కిరణ్ ప్రొడక్షన్స్ వారి ఆఫీసులో కలిశాను. ఎన్ని చిత్రాలకు రచయితగా వున్నారో చెప్పమన్నాను.

కిరణ్ ప్రొడక్షన్స్‌కి కథ, మాటలు వ్రాస్తున్నట్టు, శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ వారి 'దేవుడు చేసిన పెళ్లి,' జగపతి పిక్చర్స్ వారి 'మంచి మనుషులు', అన్నపూర్ణా సినీ ఎంటర్ ప్రైసెస్ వారి 'ఊర్వశి', రవి కళా మందిర్ వారి 'మట్టిగాజులు', విజయ భట్ మూవీస్ వారి కొత్త చిత్రం, మధు పిక్చర్స్ వారి నూతన చిత్రం తాలుకు సంభాషణలను సమకూరుస్తున్నట్టు చెప్పాడు.

ఇంతమందికి సంభాషణలను రాసే సత్యానంద్‌కి ప్రజామోదం పొందే యోగ్యతను ఆ పరమేశ్వరుడు ప్రసాదించుగాక!

వయసులో చాలా చిన్నవాడే అయినా, మేధస్సులో గొప్పవాడు గాకపోతే యిందరు సత్యానంద్‌ను కాంక్షిస్తారా?

## ప్రభాకర రెడ్డి ప్రతాపం !

కొద్ది రోజుల క్రితం విడుదలయిన "ఆడంబ రాలు — అనుబంధాలు" చిత్రం ప్రభాకరరెడ్డి నట జీవితంలో నూతన అధ్యాయాన్ని ఆరంభించింది. ఏ నోట విన్నా రెడ్డిగారు అసమానంగా నటించారు అన్న పేరు వినవచ్చింది. దాని తరువాత రిలీజ్ అయిన "దీర్ఘ సుమంగళి" చిత్రంలో ప్రభాకరరెడ్డి పిండి రుబ్బే లాయరు వేషాన్ని మోతాదు మించకుండా నటించి సెహభాష్ అనిపించుకొన్నారు. రాబోయే చిత్రాలలో కూడా వెరైటీ రెడ్డి కనిపిస్తారు. డూండీ దర్శకత్వంలో రెడ్డి ధరిస్తున్న పాత్ర గమ్మత్తయినది.

విలన్ వేషాలు గానివ్వండి, కామెడీ పాత్రలు గానివ్వండి, సీరియస్ రోల్స్ గానివ్వండి, ఎలాంటి క్లిష్టమైన భూమిక గానివ్వండి ప్రభాకరరెడ్డి చెయ్యగల ప్రతిభావంతుడు అన్న నిజం ఋజువైంది.

జయప్రద మూవీస్ నిర్మిస్తున్న "స్వతంత్రం వచ్చింది" చిత్రంలో మరో రకం రెడ్డి అగుపిస్తారు. ఆయనతోపాటు గుమ్మడి, నాగభూషణం, రవికాంత్, శుభ, ప్రభ, నిర్మల ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు. కథను గణేష్ పాత్రో రాయ, మద్దిపట్ల సూరి మిగతా కార్యక్రమాన్ని సాగించ, పి. లక్ష్మీదీపక్ దర్శ కత్వాన్ని చేపట్టారు. ఇటీవల సత్యం మూడు పాట లను రికార్డ్ చేశారు. బాలు — సుశీల — రామకృష్ణ ఆ పాటలను ఆలాపించారు.



"అమ్మ మనసు"లో భారతి

## శ్రీ రాజలక్ష్మి చిత్ర

స్వర్గీయ గరికపాటి రాజారావుగారి కుమారుడు చిరంజీవి జి. పృధ్వీరాజ్ నెలకొల్పిన సంస్థ యిది. ఈయన పినిశెట్టి రాసిన కథను కొని, దాసం గోపాలకృష్ణ చేత మాటలను వ్రాయించారు. ఈ చిత్రానికి గిడుతూరి సూర్యం దర్శకుడు. [అదృష్టం కలిసిరాక మంచి దశ నందుకోలేని మనిషి. ఈసా రయినా విజయాన్ని చవిచూడాలి.]

## రామకృష్ణ వేషం !

ఈ చిత్రంలో విభిన్న ప్రవృత్తులు కలిగిన వేషాలను రామకృష్ణ వేస్తున్నట్టు వార్త. అన్ని



"తాతమ్మ కల"లో హరికృష్ణ, రోజారమణ

అర్హతలు వున్న యీ నటుడికి యికపై జరిగేదంతా మంచిదే ఈయనతోపాటు అల్లు రామలింగయ్య, త్యాగరాజు, కె వి చలం, పండరీబాయి సహాయ పాత్రలను పోషిస్తున్నారు సంగీతానికి ఎస్ హనుమంతరావు, ఎడిటింగుకు కందస్వామి, కళకు భాస్కరరాజు, ఛాయకు కె ఎస్ మణి అధిపతులు

రామకృష్ణకు హీరోకు కావలసిన అన్ని అర్హతలు వున్నాయి అన్న విషయంపై ఎవరికీ రెండు అభిప్రాయాలు లేవు కానీ, ఎందుచేత అందదగిన అంతస్తును చేరలేకపోతున్నాడు అన్న సంశయం నాలో చాలా రోజులుగా వుండేది ఆ సందేహాన్ని కొందరు విద్యార్థులు నివర్తి చేశారు ఆయన ప్రక్కన నటించే హీరోయిన్, ఆయన్ను డైరెక్టు చేసే వ్యక్తి, ఆయన నటించే సంస్థ మున్నగు విషయాలలో జాగ్రత్త వహించక పోవడమే అన్న సమాధానం దొరికింది బెటర్ లక్ రామకృష్ణ!

### శుభ చిత్రాలయం

మద్రాసు మహనగరంలో వెలసిన మరొక నూతన చిత్ర నిర్మాణ సంస్థయే శుభ చిత్రాలయం హెచ్ కె చంద్రశేఖర్ ఈ సంస్థకు అధినేత

కృష్ణంరాజు, జయంతి, శుభ, గుమ్మడి, రాధాకుమారి, సాక్షిరంగారావు ముఖ్య భూమికలను పోషించే ఈ చిత్రానికి బి మహేష్ బాబు పర్యవేక్షణా నిర్మాత

దాసం గోపాలకృష్ణ కథ, మాటలను, జి కె వెంకటేష్ సంగీతాన్ని, బి యస్ ప్రకాష్ కెమెరాను, బి చలం కళను, రంగరాజన్ నిర్వహణను చేపట్టిన ఈ చిత్రానికి స్క్రీన్ ప్లే, దర్శకత్వం వహించే బాధ్యతను బి యస్ నారాయణ స్వీకరించారు

ఒక స్త్రీ మీద ఆరోపింపబడిన అనవసర కళంకాలను, అవి నిజంకాదు అని నిరూపిస్తుంది అదే స్త్రీ చూడకుండానే ఫలానా వారు ఫలానా పని చేశారని పుకార్లు పుట్టించేవారి వల్ల ఎందరి జీవితాలు నాశనమవుతున్నాయి అనేదే పై చిత్రంలోని ముఖ్య కథాంశం

# సినిమా

### అద్వితీయుడు ఆత్రేయ!

ఇటీవల శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ వారి "పుట్టింటి గౌరవం" చిత్రం తాలుకు పాట నొకదానిని విన్నాను అది ఆత్రేయ రాసిన పాట భారతి తాగుడు పాట

"మనసైతే మధువు తాగు
వీల్లేకుంటే విషం తాగు
మధువు మత్తెక్కిస్తుంది
విషం గట్టెక్కిస్తుంది" — ఈ పాటను

సత్యం ఆధ్వర్యంలో సుశీల అమోఘంగా పాడింది ఇట్టి పాటను ఆత్రేయ తప్ప వేరొకరు రాయగలరా అన్న ప్రశ్న వుదయిస్తే, లేరు అని అనేకులు బదులివ్వడం జరిగింది ఆయన కవితలో వుండే ప్రత్యేకమైన ఘనత చేతనే ఏడిపించినా, తిప్పించినా ఆయన చేతనే రాయించాలి అని పట్టుబడతారు అందుకే అద్వితీయుడుగా వుంటున్నాడు

పై పాటను క్లబ్ సెట్లో భారతి, ప్రభాకర రెడ్డి గార్లపై దర్శకుడు పి చంద్రశేఖరరెడ్డి చిత్రీకరించారు ఎట్టి బలవత్తర పరిస్థితులలో ఆమె తాగవలసివచ్చిందో లేక ఆమెచేత బలవంతాన తాగించారో తెలియాలంటే కథకుడు ఎన్ వి సుబ్బరాజును అడగాల్సిందే ఈ చిత్రాన్ని నిర్మించే వ్యక్తికూడా ఆయనే మాటలను మోదుకూరి జాన్సన్, కళను చలం, ఛాయను రావ్‌చవుదరి, కూర్పును మహేశ్వరరావు నిర్వహిస్తున్నారు కృష్ణంరాజు కథానాయకుడిగా నటిస్తున్న యీ చిత్రంలో సూర్యకాంతం, శుభ, రాధా, పుష్పకుమారి, రావుగోపాలరావు, సునందిని, పద్మనాభం, మిక్కిలినేని, అల్లురామలింగయ్య సాక్షి రంగారావు, గోకిన రామారావు, చిట్టిబాబు ముఖ్య పాత్రధారులు



ఆగస్టు 17 న ఢిల్లీలో రాష్ట్రపతి భవన్‌లో శ్రీ వి వి గిరికి 'ఓ సీత కథ'ను ప్రత్యేకంగా వేసి చూపించారు చిత్రంలో శ్రీ గిరిని పూలమాలాలంకృతుల్ని చేస్తున్నది నిర్మాత శ్రీ ఏ ఆర్ యస్ శర్మ పక్కన వున్నది ఢిల్లీ తెలుగు ఫిలిం సొసైటీ కార్యదర్శి శ్రీ టి ఆర్ రావు

### శ్రీ కాకతీయ పిక్చర్స్!

వరంగల్ వాస్తవ్యులు కొందరు కలిసి స్థాపించిన యీ సంస్థ దాశరథి రంగాచార్య విరచితమైన "చిల్లర దేవుళ్లు" నవలను సినిమాగా నిర్మిస్తున్నారు మాటలను ఆయన చేతనే రాయిస్తున్నారు ఈ చిత్రానికి ముఖ్య పాత్రలను పోషించడానికి కొత్త నటీనటులు కావాలి అని, దర్శకత్వం చేపట్టిన టి మాధవరావు చెప్పారు నటించడానికి వుబలాట పడేవాళ్లు దయానంద కాలనీ, వరంగల్‌కి వెళ్లి నిర్మాతలను, దర్శకుడ్ని సంప్రతించవచ్చు

"చిల్లర దేవుళ్లు" తెలుగు రైతుల జీవిత సమస్యలకు సంబంధించిన కథ సాహిత్య అకాడమీ అవార్డు నందుకొన్న కథ ఈ చిత్రంలో ప్రభాకర రెడ్డి ప్రధాన పాత్రధారి తతిమ్మా పాత్ర లన్నిటికీ కొత్త వాళ్లనే పెట్టాలన్నది దర్శకుని అభిప్రాయం

వరంగల్ పరిసర ప్రాంతాలలో నవంబరు నుంచి షూటింగు ప్రారంభం ఈ చిత్రానికి కె వి మహదేవన్ సంగీతాన్ని, మునీర్ అహ్మద్ ఛాయను నిర్వహిస్తారు

దర్శకుడు మాధవరావును గూర్చి రెండు ముక్కలు వ్రాస్తాను 'తాళిబొట్టు, కన్నతల్లి' చిత్రాలు షుమారుగా వున్నాయి ఈయన దర్శకత్వంలో వెలువడిన "సూరజ్ అవుర్ చాంద్" హిందీ చిత్రం ఘన విజయం సాధించింది

### ఇంటింటి కథ

లక్ష్మి రమణా కంబైన్స్ వారి ఈ చిత్రం షూటింగు పదమూడు మాసాలకు పూర్తయింది కథలో సభ్యత, సంస్కారం వుంది గాబట్టే ప్రతి మనిషి చూడదగిన చిత్రం గాబట్టే "ఇంటింటి కథ" అని పేరు పెట్టారు ఈ చిత్రానికి కామినేని ప్రసాద్, కాకర్ల కృష్ణ నిర్మాతలు

### హీరో ఉద్యోగం!

హీరో కృష్ణ ఉద్యోగంకోసం మదరాసు నగరానికి వస్తాడు ఓహో ప్రొడక్షన్స్ వారి చిత్రంలో హీరో వేషం లభిస్తుంది కథానాయకుడి పాత్రను పోషించి, బేనర్ వేల్యూని పెంచి, తనపై క్రేజు ఏర్పడేట్టు మొదటి చిత్రంలోనే నిరూపిస్తాడు కృష్ణ హీరోగా నటించిన చిత్రానికి కె వి చలం నిర్మాత సంగీత దర్శకుడిగా మాడా, ప్రొడక్షన్ మేనేజరుగా వెంకన్నబాబు నటించారు ఈ చిత్రానికి ఎడిటరు కె సత్యం డైరెక్టరు

"ఇంటింటి కథ" చిత్రంలో సత్యనారాయణ, రమాప్రభ దంపతులుగా గమ్మత్తయిన పాత్రలను పోషించారు ఇంటి యొక్క బరువు, బాధ్యతలను అంజలీదేవి, గుమ్మడి మోయాల్సిందేగా చితికిపోయిన కుటుంబాన్ని, అతకని బతుకుల్ని ఏకం చేసిన వేషం కృష్ణది పరువు మంటగలిపి, పరువంకోసం అన్నీ తెంచుకొన్న దుష్టుడి పాత్రను రామమోహన్ పోషించాడు హీరోను ఏడిపించి, అతని వొడిలో జీవితాన్ని సాగించిన నాయికగా చంద్రకళ నటించింది ఇంకా పద్మనాభం, అల్లురామలింగయ్య, సుమ, సునందని వున్నారు

—శ్రీనివాస్

## చక్కని ప్రింట్లు చల్లని ప్రవాహము

**బోంబే డైయింగ్ వారి రూపదర్శిని**

ఎన్నో డిజైనులనుండి ఎన్నుకొని
ఆనందములో తేలియాడండి.
బోంబే డైయింగ్‌వారి
ఆధునికమైన రంగురంగుల
డిజైనుల సూపర్ ఫైన్ పాప్లిన్లు,
లాన్స్, కేంబ్రిక్స్ మరియు
పోలియెస్టర్/కాటన్ మిశ్రమములు
లభిస్తున్నాయి.
పోలియెస్టర్ మరియు కాటన్
డెనిమ్స్‌లో 20 ఆకర్షణీయమైన
చాయలు. మళ్లీ మళ్లీ
చూడాలనే మంచి విందు.



# బోంబే డైయింగ్

లోకం పోకడ —ఊమెన్




## లాలస

(14వ పేజీ తరువాయి)

శుక్రవారం ఆడపిల్లలంతా అభ్యంగన స్నానం చేస్తారు పైగా ఇంకొక విశేషమేమిటంటే అనూరాధని చూసుకుందుకు ఈ రోజునే వస్తున్నారు పన్ను తెమలాల మరి? అందు కని రోజూ కంటే ఓ ఘడియ ముందు లేవక తప్పలేదు

మెల్లిగా రమణ కూడా పుస్తకాలు పక్కన పెట్టి దొడ్లోకి వచ్చాడు అనూరాధ కుంపటి ముందు కూర్చుని కాఫీ కలుపుతోంది కొంచెం అక్కగార్ని ఆటలు పట్టించాలని

## ఓ గణపతీ!

ఓ గణపతీ నీ రాక వింత
నీ వాలకం ఒక వింత
నీ పుట్టుకే ఒక వింత
పండి బొమ్మగా పుట్టావు
ప్రాణం రూపం దాల్చావు
పాపం! శిరస్సు తెగిపోతే
ఏనుగు తల అతికించుకున్నావు
ఆధునిక శస్త్ర చికిత్సకులకు
ఇది భలే వింత!
షడ్రసోపేత భోజనం వద్దన్నావు
ఉండ్రాళ్లే అమృతంగా భావించావు
ఉక్కిరిబిక్కిరిగా తిన్నావు
జాబిల్లి హేళనగా నవ్వితే
పొట్ట చీల్చుకున్నావు
మళ్లీ శస్త్ర చికిత్స— అది ఒక వింతే
యథాశక్తి దక్షిణ ఈనిదే
ఏ పని జరగని యీ రోజులలో
రాకెట్లలో పయనించే యుగంలో
ఎలుకమీద తాపీగా వచ్చి
గడ్డిపరకలకే పొంగిపోయి
వరాలివ్వడం వింతల్లో వింత!

—శ్రీపాద లక్ష్మినారాయణమూర్తి

పించిందతనికి ఎంతైనా కాలేజీ కుర్రాడు ఆడపిల్లల్ని ఏడిపించటంలో వున్న ఆనందం అతనికి మరి ఎందులోనూ కనుపించదు

"ఇవాళ మన ఇల్లు ఇలా కళకళ లాడి పోతోంది పైగా అంతా తొందరగా లేచారు ఏమిటే ఇవాళ మనింట్లో విశేషం" అన్నాడు చిన్నచెల్లెలు సుందరితో వారగా అనూరాధని చూపించి కనుసైగ చేశాడు

# ఒకే ఒక భారీ వర్షంతో మామూలు గంధకము కొట్టుకుపోతుంది.

## అంటిపెట్టుకొని ఉండే ప్రత్యేకమైన పదార్థం దేవిసల్ఫర్‌లో ఉండడంవలన అది గంధకమును ఖాయంగా చాలకాలం నిలచేటట్లు చేస్తుంది












మామూలు గంధకమైతే వర్షం వలన కొట్టుకు పోవచ్చు దేవిసల్ఫర్‌లో అంటుకొని ఉండే ప్రత్యేకమైన పదార్థం ఉంది దాని కారణంగా నిలచి ఉంచే శక్తి పెరిగి వర్షం వలన కొట్టుకు పోకుండా ఆపుతుంది ఫలితంగా మీ మొక్కలకు మీరు అదనపు రక్షణను ఖాయంగా సమకూర్చుకోగలుగుతారు

దేవిసల్ఫర్ నాణ్యమైన పొడి గనుక నీటిలో సులభంగానూ, త్వరగానూ కరుగుతుంది ప్రతిసారీ సరియైన, మేలైన స్ప్రే మిశ్రమము తయారవుతున్నదన్నది మీరు నిశ్చయపరచుకోవచ్చు మామూలు గంధకము వలె నాజిల్‌లో పూడుకు పోవడం వంటి ఇబ్బందులు ఉండవు

దేవిసల్ఫర్ వలన సదుపాయాలు:

(1) స్ప్రే మిశ్రమమును సులభంగా తయారు చేసుకొనె వీలు

(2) దీనిలోని చురుకైన పదార్థం యొక్క సరిసమానమైన పంపకము

(3) చాలా కాలం నిలచి పని చేసే స్ప్రే మిశ్రమపు చర్య

మామూలు గంధకము ఏదీ కూడా ఇన్ని సదుపాయాలను సమకూర్చదు అందుకే, మీరొక వేళ మామూలు గంధకము వాడుతూంటే వెంటనే దేవిసల్ఫర్ 80% డబ్ల్యు డి పి వాడడం ప్రారంభించండి

*సల్ఫర్ మాత్రమే గాకుండా దేవిదయాల్ వారు ఎన్నో రకాల తెగుళ్ళ వినాశనులను సమర్పిస్తున్నారు డిడిటి, బిహెచ్‌సి, ఎండ్రిన్, కాపర్ ఆక్సిక్లోరైడ్, కార్బరీల్, క్లోరినేటెడ్ క్యాంఫీన్, పెరాథియాన్, మలాథియాన్, క్లోర్‌డేన్, మొదలైనవి

## దేవిసల్ఫర్ 80% డబ్ల్యు డి పి



# దేవిదయాల్ ఎగ్రో కెమికల్స్

దేవిదయాల్ (సేల్స్) ప్రైవేట్ లిమిటెడ్
వారి విభాగము శే రోడ్, బొంబాయి 400 010

mcm/dac/2d tel

ప్రాంతీయ కార్యాలయం: మె. దేవిదయాల్ (సేల్స్) ప్రై లి కుమార్ మాన్షన్ 5—9—164 చాపెల్‌రోడ్ మాడిరెడ్డి చర్చి ఎదుట హైదరాబాద్—500001
బ్రాంచి కార్యాలయం మె. దేవిదయాల్ (సేల్స్) ప్రై లి 27—10—32 అరా రత్తయ్య వీధి గవర్నరుపేట విజయవాడ—520002
డీలర్లు 1 శ్రీ వరలక్ష్మి ఆగ్రో సర్వీసెస్ (ఎ) కాకుమాను (వయా) పెదనందిపాడు గుంటూరుజిల్లా పోస్ట్ 25 (బి) 26—1—90 పోర్టుజనరోడ్ గుంటూరు 2 జయా ఆగ్రో కెమికల్స్ మెయిన్‌రోడ్ కాకినాడ 3 అనంతలక్ష్మి ఏజన్సీస్ ప్రకాశ మున్సిపల్ మార్కెటు ఎదురుగా తాడేపల్లిగూడెం పశ్చిమ గోదావరి 4 జి కొండారెడ్డి & కో మహబూబ్‌నగర్ • 5 జగని లక్ష్మయ్య & సన్స్ నల్గొండ • 6 కిరణ్ & కో గాంధీ రోడ్ ఖమ్మం 7 పార్థసారధి & కో బషీర్‌బాగ్ హైదరాబాద్ 8 ఉమాశ్రీ ఆగ్రో ఏజన్సీస్ ఖమ్మం

సుందరి రమణకి తగ్గదే! పిల్ల మహా హుషారు! చటుక్కున నోట్లోంచి బొగ్గు ముక్కని బయటికి వూసి "అరె! నీకు తెలియదట్రా! ఇవాళ ఇవాళా "

'ఊ ఇవాళ ?!"

"మనింటికీ "

"ఊ మనింటికీ ? "

"మన రాధా దేవిగార్ని చూసుకుందుకు డాక్టరు బావగారు వేంచేస్తున్నారు అదీ సంగతి సందర్భం నాయనా" అంది హాస్య ధోరణిలో

'నోరు మూసుకో! ఏమిటా వాగుడు" అంది అనూరాధ కోపంగా

"ఏమ్మా! ఏం అది వున్నమాటే అంది" అన్నాడు రమణ

'ఏమిట్రా వున్నమాట? వెధవ వాగుళ్లూ మీరూనూ'

'వాగుళ్లు ఎందుకయిందే! ఇవ్వాళ వాళ్లు నిన్ను చూసుకుందుకు రావటంలేదా? అయినా మేమేదో చెప్పుకుంటుంటే నీ కెందుకే అంత వులుకు వెధవ్వాగుళ్లెందుకయ్యింది మంచివాగుళ్ళే' అన్నాడు

"మంచి మాటలుట! మంచి ఏమిట్రా మంచి ? మీరెన్ని అయినా అనుకోండి నా కేం వులుకులేదు కాని బావా గీవా అంటూ వరసలు పెట్టారంటే మాత్రం పీకలు నొక్కుతాను" అందిఆవేశంగా

ఫకాలున నవ్వాడు రమణ "ఒసేవ్! అక్కా అదా నీబాధ ? తప్పేముంది, పెళ్ళయితే ఆయన కాబోయే బావగారు లేక పోతే తప్పిపోయిన బావగారు అంతేగాని " అంటూ ఏదో అనబోతుంటే మధ్యలోనే రుసరుసా అందుకుంది 'ఏరా ఆనోటికి శుద్ధీ బుద్ధీ లేదా ? కాబోయే ఏమిటి తప్పి

## లా ల స

పోయిన ఏమిటి ? చూసుకుందుకు వచ్చిన ప్రతీవాడ్నీ నాకు వరస చేసెవంటే మర్యాద దక్కదు" అంది ఎర్రగా చూస్తూ

నిజమే అనిపించింది రమణకి తమకంటే ఇదంతా ఏదో సరదాగా తమాషాగా వుంది కాని పాపం అక్కయ్యది ఎంత "అక్వర్డ్ పొజిషన్ ?" తరచూ ఎవరో ఒకరు చూసు కుందుకు వస్తూనే వున్నారు అందరి ఎదుట అలంకరించుకు కూర్చోవటం పాట పద్యం అప్పగించటం, చెప్పటం ఇదంతా మనసుకి ఎంత కష్టం అనిపిస్తుంది ? ఇంత జరిగినా అబ్బాయిని అమ్మాయి ఇష్టపడిందా లేదా ? అన్నది ప్రశ్నకాదు అబ్బాయి అమ్మాయిని ఇష్టపడ్డాడా లేదా అన్నదే ప్రశ్న! అన్నిం టినీ మించి కట్నకానుకలు బాగుంటే పెళ్ళి నిమిషాలమీద జరిగిపోతుంది ఆపాటిదానికి ఈ చూపు లెం దు కు అనిపిస్తుంది అమ్మాయిలకి

"పొద్దున్నే ఏమిట్రా ఈ తగాదా! పెద్దవాళ్ళకి బుద్ధుల్లేవు చిన్నవాళ్ళకి బుద్ధుల్లేవు" అంటూ తల్లి వచ్చి అదిలించ టంతో అక్కడికి ఆ తగాదా తీరింది

అనూరాధ వూరుకుండిపోయింది నీళ్ళల్లో కాఫీపొడివేసి దించి, పాలగిన్నె కుంపటిమీద పెట్టింది కాఫీలు కలపటమే ధ్యేయంగా చకచకా కెలవంచుకుని ఆపని చేస్తున్నది అట్లా తల వంచినపుడు జుట్టు రింగులు రింగులుగా జారి నుదుటిమీద నాట్యమాడు తున్నది కోపంతో మూతి బిగించటం వల్ల ముక్కుచివర కోపంతిష్ఠవేసినట్లు తెలుస్తు న్నది నడుంచుట్టూ పమిట బిగించటంవల్ల వంపుసొంపులు ఇంకా బాగా ప్రస్ఫుటమవు

తున్నాయి మెళ్ళోని లాకెట్ చెయిన్ పువ్వుల వోణీ మీదుగా జారి సూర్యకిరణాల తాకిడికి మెరుస్తున్నది ఆ భంగిమలో ఆమె చాలా చూడముచ్చటగ వుంది

"ఒసేయ్ లక్ష్మీ! ఆ కాఫీలపని అయ్యాక ఆ గ్లాసులు నువుతోమేయి అక్కయ్యముందు తలంటుపోసుకుంటుంది' అంది సుభద్రమ్మ

కాఫీ తాగి అనూరాధ జట్టు విప్పుకుని పీటమీద కూర్చుంది తల్లిగిన్నెతో నూనెతెచ్చి చేతిలో వేసుకుని అనూరాధ తల మీద అంటుతూ 'మంచి ముహూర్తాన పెళ్లి కూతురువై, శోభనపు పెళ్లి కూతురివై, బాలసారె పెళ్లికూతురివై నీ అమ్మ కడుపు చల్లగా, నీ అత్త కడుపు చల్లగా, కూతుళ్ల తల్లివై కొడుకుల తల్లి ' అంటూ దీవెనలు మొదలుపెట్టింది " వాల్లేవే నీ దండకం " అంటూ విసుక్కుంది అనూరాధ పక్కనే వున్న లక్ష్మి, సుందరి ఫకాలున నవ్వారు

"ఎందుకర్రా నవ్వుతారు! మీ కడుపు బంగారం గానూ దీవించకపోతే ఎల్లా ? దేముడి దయవల్ల తలంటుకున్న వేళా విశేషం మంచిదయి ఈ సంబంధం కుదురుతే మళ్లీ తలంటు పెళ్లితలంటు అవుతుంది"అంది

'ఊ సర్లేపద"అంటూ లేచి బాత్ రూమ్‌లోకి దారి తీసింది అనూరాధ

"పెళ్లికొడుకు డాక్టరు కోర్సు మూడవ సంవత్సరం చదువుతున్నాడు కుర్రాడు అంద గాడు కట్నంకూడా తగినంతలోనే వున్నారు ఏడుకొండలవాడి దయవల్ల ఈ సంబంధం కుదిరితే బాగుండు పసుపు బట్టలతో కొండకి పంపిస్తాను "అనుకుంటూ అలాగే రెండు చేతులూ ఎత్తి గాల్లో నమస్కారం చేసింది సుభద్రమ్మ (ఇంకా ఉంది)

---

రూపాలనుధరించి క్రీడించినప్పుడు ఇతడు ఉద్భవించాడు అందువల్ల గజశిరస్సు వచ్చింది మరోగాథ ననుసరించి ఇతడు పార్వతీదేవి ఉద్వర్తన పిష్టంతో తయారైన వ్యక్తి తన్ను లోపలికి పోకుండా అడ్డుకొన్నం దున శివుడు ఇతని తలను ఛేదించాడు పార్వతీదేవి గోలపెట్టగా గజశిరస్సు గణపతి దేహానికి అతుకబడింది

ఇతడు ద్వైమాతురుడు (ఇద్దరు తల్లుల ముద్దుబిడ్డ డు) కావడానికి ఈ గాథలు కారణ మౌతాయేమో! గంగాదేవికీ గౌరీదేవికీ కూడా అభిమానపుత్రుడు కావడంవల్లనైనా ఇతడు ద్వైమాతురుడు కావచ్చును ఈ విషయాన్ని

## వెనకయ్య వింతలు

(7వ పేజీ తరువాయి)

పరిశోధకులే నిర్ణయించాలి

ఇతనికి మొదట్లో రెండు దంతాలూ ఉండేవట! కాని, ద్రాక్షాధ్వరధ్వంస సమయంలో వీరభద్రుడు కోపించి, యాగశాలలో తిష్ఠ వేసుకుని కూర్చున్న యితని దంతాన్ని ఊడ గొట్టాడట! ఒక్కదంతమే మిగిలి ఉన్నందున ఏకదంతుడైనాడట! ఇలా కొందరు చెప్తు న్నారు శివుని దర్శించుకోడానికి వచ్చిన పరశు రాముణ్ణి ఇతడు అటంకపరచగా, అతడు కోపించి తన గండ్రగొడ్డలితో ఒక దంతాన్ని విరగగొట్టాడట! అందువల్లనే గణపతి ఏక

దంతుడైనాడట! ఇది మరికొందరు చెప్పే గాథ ఇందులో ఏది నమ్మదగినదో పరిశో ధకులే చెప్పాలి ఏది ఎలాఉన్నా ఇతని దంతాలు రెండింట్లో ఒకటి ఊడిపోవడం మాత్రం సత్యం

శివునిపయి పగ సాధించాలని గదా దక్షుడు యాగాన్ని ప్రారంభించాడు! ఆ అధ్వరానికి శివకుమారుడు ఎందుకు వెళ్లాలి ?

ఏకార్యం ప్రారంభించినా మొదట విఘ్నే శ్వరపూజ అవసరం గదా! అందుకనే దక్షుడు మనమణ్ణి బతిమాలి తీసుకు వెళ్లాడు గుజ్జ వేల్పునకు స్వపక్ష – పరపక్ష భేదం లేదు అందరూ సమానమే! అందువల్లనే అక్కడికి

(48వ పేజీ చూడండి)






నిర్మలా ఎంటర్ ప్రైజెస్

# చైర్మన్ చలమయ్య

దర్శకత్వం జి. రామినీడు

నిర్మాత ఎస్. పద్మనాభరెడ్డి * సంగీతం సలీల్ చౌదరి

* ఆంధ్ర: తారకరామ నైజాం: నవభారత్ సైజాం శ్రీతారకరామ

వాలుకుర్చీలో కూర్చొని, రేడియో ట్యూన్‌చేసి కమ్మగా వస్తున్న పాటకి అనుగుణంగా — కూనిరాగం తీస్తూ, "శ్రీమతిగారూ తియ్యని కిళ్లీ ఒకటి చేసిస్తారా ?" అన్నాడు కుమార్ తన శ్రీమతిని ఉద్దేశించి .

# త్రికసంధి

కొండపల్లి సత్యకుమార్



రాగతి పండరి

"ఓ పదినిమిషాలోపిక పట్టండి" అంటూ జవాబిచ్చింది వంటిల్లు సర్దుతున్న శ్రీమతి .

"తప్పుతుందా మరి "అనుకుంటూ కాస్త వక్కపొడి నోట్లోవేసుకుని టీపాయ్ మీది మేగజైను తిరగేస్తూంటే, శ్రీమతి ప్రవేశించింది

"ఇప్పుడైనా వీలుందంటారా ?" అంటూ—సోఫాలో కూర్చుంటున్న చెలి బుగ్గని మీటేడు కుమార్

"ఆఁ ఆఁ అక్కడిమటుకే ఆగండి ముందు ఈ ఇంటర్‌వ్యూ అయినతర్వాత ఈ విషయం ఆలోచిద్దాం "నాలిక బయట పెట్టి వెక్కిరిస్తూ అంది శ్రీమతి .

' ఇంటర్‌వ్యూ మొదలెట్టేముందు కిళ్లీ ఇచ్చేస్తే, సావధానంగా సమాధానాలివ్వడానికి సిగరెట్టు దమ్ముల్లాగొచ్చు—కాస్త ఆ పుణ్యం —' అన్నాడు అర్థోక్తిగా

'మిమ్మల్ని కట్టుకున్నందుకు ఆ పుణ్యం కట్టుకోవాలిగా తప్పుతుందా మరి ?" అంటూ తుని తమలపాకులు చిలకలు చుట్టి తాంబూలమసాలా దట్టించి శ్రీవారికి అందిస్తూ ఊరించ సాగింది శ్రీమతి

కిళ్లీనమిలి మింగుతూ "చాలా తియ్యగా ఉంది వలపులు కూరేవా ఇందులో " అంటూ సఖి చెంపల్లోని అదురుని, కళ్లలోని కాంక్షని చూస్తూ మెల్లిగా దగ్గరికి లాక్కోబోయేసరి

' ఆగాలి ముందు ఇంటర్‌వ్యూ కావాలి" అంది పెదాల్ని మున్నాలా చటి , వయ్యారంగా ఒక్కచెయ్యిని గెడ్డంకింద పెట్టుకుని .

కలలోని సౌదామిని కనుల ముందుండేసరికి, "అది సరేకాని, వోరు వండిందేమో చూడు "అంటూ నాలిక బయట పెట్టాడు

"అబ్బ ఎంత ప్రేమ నేనంటే "అంటూ

పద్మనాభం సమర్పించు రేఖా & మురళీ ప్రొడక్షన్స్

# మాంగల్యభాగ్యం



చేతులు రెంటినీ వేసి, మోకాళ్లని కట్టేసి, వాటిమీద తలాన్చి ఓరగా చూసింది

"లేదేంటి మరి " అన్నాడు కుమార్. ఆశగా. శ్రీమతి కురుల్లోంచి వచ్చే విరులు పెట్టే గుబులుకి—ఓపలేక, సోఫాలో శ్రీమతి పక్కన చేరేడు

"లేకేం కావలసినంత—రోజూ ఆఫీసునుంచి వచ్చేప్పుడు ఓ పావలా మల్లెపూలు-తెస్తున్నా రుగా" అంటూ చీకలు చేయడానికి పూను కుంది

"కీళ్లలు చాల్లేవోయ్ ఈ వేళ. ఈవేళ " అంటూ పణిగేడు

"ఆఁ ఈవేళ " అంది కళ్లని మరింతగా విశాలం చేస్తూ

"నువ్వెంత బాగున్నావో తెలుసా ? " అంటూ శ్రీమతిని అక్కున చేర్చుకున్నాడు — అదే ఛాన్సని మేఘాల చాటుకెళ్లాడు జాబిల్లి తానని కలిసేందుకు

"అదిగో ఎవరో వచ్చేరు " అంటూ ఒక్కసారి వీధిగుమ్మంకేసి చూపించి తుర్రు కుంది శ్రీమతి కుమార్ చేతిలోని మల్లె చెండు వెక్కిరించింది 'పూర్ ఫెలో' అన్నట్టు —

"మోసపోయాను కదరా" అనుకున్నాడు కుమార్ స్వగతంలో—

వంటింటిపని పూర్తిచేసుకుని, లైట్లార్పి హాల్లోకి వచ్చేసరికి ట్రాజెడీకింగ్ రాజ్ కుమార్‌లా సిగరెట్స్ ఊదేస్తూన్న శ్రీవారిని చూడగానే, శ్రీమతికి జాలి ముంచుకొచ్చి నట్లుంది

"బుద్ధి పడుసెట్టారా ? ఈ ఇంటర్ వ్యూలో నెగ్గితేనే — లేకపోతే మన పక్కలు సెత్తర, దక్షిణ ధృవాల్లో అండర్ స్టాండ్ ?" శ్రీమతి అనేసరికి

# త్రికసంధి

స్వగతంలో అనుకున్నాడు కుమార్, "దేవుడా చెడ్డ చిక్కొచ్చిందోయ్ ? అఖండ మైన నీ తెలివిని నాకు తగలేయ్" అని—

"అర్యూరెడీ " అంటూ "ఇప్పటి మగాళ్లలో పురుషలక్షణం తగ్గిపోతూ ఉందం టాను జవాబు ఏమిటి ?" అంది కరుకుగా, కళ్లు త్రిప్పిచూస్తూ—




రెడ్‌విల్స్ పాకెట్ ఖాళీ అయిపోయింది—ఆలోచించ సాగేడు కుమార్ 'మగాళ్లలో పురుషలక్షణం తగ్గిపోతూండట మేంటి — ప్రశ్న మరీ పచ్చిగా ఉంది భర్త వేగా జవాబిస్తే పోలే — ఇవ్వకుండా ఎందుకొచ్చిన ఎడబాటు ' విశ్చయించుకున్నాడు కుమార్ —

"ఏయ్ మందబుద్ధీ— ఏం జవాబిద్దామను కుంటున్నావు" అంతరాత్మ లంది

"అదేనోయ్ ఆలోచిస్తున్నాను" ఆత్మ బదులిచ్చింది

"అయిడియా తట్టిందోయ్ "

"ఏవిటోయ్-అది " ఆత్రుతగా అంది ఆత్మ

"మరేం లేదు — ఆకాలంలో ఉద్యోగం పురుషలక్షణంగా కాని ఈ కాలంలో ఉద్యోగా లెక్కడేడిపోయి అదే అయుం టుంది "

"కాస్త గటి గాచెప్పి తగలడరాదూ "

"తప్పేమో అన్న భయం. " అంది అంతరాత్మ సంకోచంగా

"ఏమోహం ధైర్యే సాహసే లక్ష్మీ" అంటూ బలపరిచింది ఆత్మ — రింగులొదు లుతూ చెప్పేడు తకేమని

"కరెక్ట్" అని మరో ప్రశ్నకోసం కళ్లు మూసుకుని ఆలోచించ సాగింది శ్రీమతి— అదను గమనించి శ్రీమతిని దగ్గరగా లాక్కు న్నాడు — బుగ్గలు నిమిరి, ముంగురులు సవరించేసరికి— ముక్కుమూసుకున్న శ్రీమతి, "దూరం జరగండి సిగరెట్టు కంపూ మీరూనూ " అనేసరికి

మిగిలిన చిన్న పీకను— యాష్‌ట్రేలో పడేసి, "అయిపోయిందోయ్ పోనీ పుక్కిలించి వస్తాలే " అంటూ బాత్‌రూమ్‌కేసి వెళ్లేడు కుమార్—

"ఏవిటేవిటీ మళ్లీ వస్తారా! ఆ పప్పులేవీ ఉడకవు ముందు నా ప్రశ్నలు, తర్వాత జవాబులు ఆతర్వాతే మీ విషయం ఓకే " అంటూ ఛాదస్తంగా బాత్‌రూం కెళుతున్న శ్రీవారిని చూసి చిలిపిగా నవ్వి, కాసేపు ఆలోచించింది

సోప్‌తో ముఖం కడుక్కుని వచ్చిన శ్రీవారికి టవల్ అందిస్తూ— "త్రికసంధి సూత్రాన్ని క్లుప్తంగా వివరిస్తారూ ?" అడిగింది శ్రీవారికి రాని వ్యాకరణంతో ఏడిపిద్దామని—

"ఏమిటోయ్, నువ్వు మరీనూ— త్రిక సంధులూ అవీ, అడగాలని అడుగుతూ— నన్ను తికమక పెట్టకపోతే, ఈనాటికి గుడ్ నైట్ చెప్పెయ్యరాదూ" అన్నాడు కాస్త సీరియస్‌గానే—

'ఓయబ్బో అయ్యగారికి పుస్సొచ్చి నట్టుంది " అంటూ సోఫామీంచి లేవబో తూన్న శ్రీమతి పైటచాటుగా, చిరు కోపాన్ని సింగారించుకున్న ఆ ముఖారవిందాన్ని గమనించిన కుమార్ ,

"అమ్మాయిగారు అలిగితే అబ్బాయిగారి పని గోవిందోహ "జవాబు వస్తుందేమోనని చూస్తూ, కాని జవాబివ్వకుండా—కళ్లెర్రచేసి, బుంగమూతిని బిగించింది—

"అలకలో సత్యభామ అందంలో చంద మామ హే భగవాన్ ఆడవాళ్ల అందం అంతా తమదే అన్నగర్వపరులు వాళ్లకి ఈ చిరుకోపాన్ని ఇచ్చి మరింత అందంగా చేశావు " కవిత్వం పనిచేయలేదు

"రాణీగారూ మీచేతుల చెఱసాలలో బంధించి, వాలుజడ కొరడాతో నన్ను శిక్షిం చండి ఈ దోషిని క్షమించండి" అంటూ శ్రీమతి కాళ్లని గట్టిగా వాటేసి, పాదాల్ని వెలికొసలతో తాకాడు

"ఏయ్ మిస్టర్ గెటప్ లే ఉఁ. ఉరో " అంది అధికార స్వరాన్ని—అభిన యిస్తూ, నవ్వాపుకోవటానికి ప్రయత్నించింది శ్రీమతి

సీరియస్‌గాలేచి, తనూ సీరియస్‌గా ఉండి పోవాలని—వెళ్లి పరుపుమీదికి చేరుకుని, ముసుగుతన్ని పడుకున్నాడు

శ్రీవారిని లేపేందుకు ప్రయత్నించింది— అది అసలునిద్రకాదుగా మెలకువ రావడానికి. రేడియో ఇండోనేషియా ట్యూన్ చేసి,

వాల్యూమ్ ఎక్కించి, కుర్చీలో కూర్చొంది

ఒక్కఉదుటున లేచి, చరచరా వచ్చి— రేడియో ఆఫ్‌చేయబోయాడు

"ఆఫ్-చెయ్యకండి" అంది దొర్లు కొంటున్న నవ్వు ఆపుకుంటూ—

"ఫుల్ వాల్యూం పెడితే, మరెవ్వరూ లేరనా, నీ అభిప్రాయం మాకు నిద్ర చేటు" అంటూ చిటపట నటిస్తూ శ్రీమతి కేసి చూసేడు కుమార్

"సరే కట్టేసుకోండి" అంటూ లేచి పరుపు మీదకెళ్లి పడుకుంది రేడియో కట్టేసి, తలుపులు గడియవేసి పడకవేరే సరికి, ఫేను గాలికి రెపరెపలాగుతూ ముంగురులు నాట్యమాడే ఆ ముద్దు మోముతో, శ్రీమతి విశాలమైన కన్నుల్నిమూసి నిద్రనటిస్తూ పడుకుంది

నిద్రలేపే విధానం తోచక ఫేనుస్పీడు హెచ్చించేడు శ్రీమతి చలించలేదు మరింత దగ్గరగా జరిపాడు ఫేన్‌ని - పైట ఎగిరింది తాళి మెరిసింది — ఒద్దికంగా ఆవులించి, అనాలోచితంగా పాలగ్లాసు అందుకుని ఖాళీచేసేసాడు కుమార్ — మెత్తని పరుపుమీద శ్రీమతి కాళ్లదగ్గర పడుకున్నాడు అంతలోనే

"ఎంతటివారైనా కాంతాదాసులేగా" ఇంతలేసి కళ్లతో, వ్యంగంగా పాడింది శ్రీమతి

'రాట్ కథ అడ్డం తిరిగిందే' అనుకుని, "కాదంటే వీరు ఊరుకుంటారేం ఏడిపించుకు తినేయరూ ?" అన్నాడు పక్కకి చేరుకుంటూ—

"మిమ్మల్ని ఎవరేడవమన్నారు పక్కగా త్రికసంధి సూత్రం చెప్పి ఉంటే కథ ఇంత దూరం వచ్చేది కాదుగా ఇంత రాద్ధాంతం జరిగేది కాదు అయినా ఇది మీ సహనానికి



# త్రికసంధి

ఓ శాంపిల్ టెస్ట్" అంది లేచి కూర్చుంటూ

"నువ్వు ఇలాంటి తిక్క సూత్రాలు అడుగుతావని తెలిసుంటే, ఈ సూత్రాన్ని కట్టుకపోదును అది సరేగాని చదువుకుంటున్నన్ని రోజులూ తెలుగు మెస్టారు ఈ వ్యాకరణ సూత్రాలు అడిగి సగం చంపేడు (సెమ పారాయి చెప్పాల్సిన నీవు స్పెషల్ తెలుగు ఎందుకు తీసుకున్నావో గాని నన్ను కట్టుకున్న ఈ మొగుణ్ణి చంపుతున్నావు"

"మీకు తెలుగు వ్యాకరణ జ్ఞానం నాస్తి, నాకు ఇంగ్లీష్ గ్రామర్ కొరకరేని కొయ్య ఆ రోజు మొదటిరాత్రి-వరకి నన్ను తికమక పెట్టలేదూ వీరు ఇంగ్లీష్ పరిజ్ఞానంతో

గదిలోకి అడుగెట్టాను — "క్లోజ్ ది డోర్" అన్నారు, తలుపు వేయబోయాను "థేంక్ ది వాయిస్" అన్నారు నాకెం తెలుసు మీరు గ్రామర్ అడుగుతున్నారు గొంతు మార్చమంటున్నారేమోనని, గొంతు సవరించుకున్నాను "నాన్సెన్స్" అంటూ విసుక్కున్నారు నాకు ఏడుపొచ్చింది, కన్నీళ్ళ తరువాయి

'శ్రీటెస్-జాన్ మిల్టన్ చచిపోయిందెప్పుడు," అని మరో ప్రశ్నా బాణాన్ని గుచ్చేత్తారు — "మా ముత్తాత కేరు మన్నప్పుడు" అందామనుకున్నాను ఒళ్ళు మండిపోయింది కాని ఏమీ జవాబివ్వలేదు ఆ సంఘటన గుర్తుకొచ్చి ఇప్పుడు త్రికసంధి సూత్రం అడిగేను అదీ సంగతి!" అంది గలగల నవ్వుతూ—

'సఖీ నీ నవ్వులో గోదావరి తరగల గలగల ఉంది నీ నీలికళ్లలో తారకు మిల మిల ఉంది నీ మేనిలో శరత్ చంద్రికల తళతళ ఉన్నాయి' అనుకుని "నీ ఇంటర్వ్యూ అయిపోయిందా?" అంటూ శ్రీమతి భుజాల మీద చేతులు వేయబోయాడు

"అప్పుడే నా ప్రశ్నకి జవాబివ్వలేదు ఆ ప్రశ్నకి జవాబిస్తే ఇంటర్వ్యూ పూర్తయినట్టే కాస్త ఆలస్యమైనా ?" అంది శ్రీమతి దూరంగా జరిగి

"ఐ ఆబ్జెక్ట్ యువరానర్ ముద్దాయికి ఈ ప్రశ్న అర్థం కానందున వ్యాకరణ అంశాలు మినహా మరే ప్రశ్నయినా అడగావు







సిందిగా దేవిగారికి విన్నవించుకుంటున్నాను" అన్నాడు అడ్వకేట్‌లా—

"అబ్జెక్షన్ వోవర్‌రూల్డ్ ఆడది — అంటే ?" అంది పందిరి మంచం మీద వెనక్కి జారబడి కుమార్‌కి మతి చలిస్తూంది రతిదేవిలాంటి శ్రీమతిని ఆస్పిల్‌లో చూస్తుంటే కాని శ్రీమతిగారి అంకుశంలా పొడవసాగింది

"ఆడది అంటే లేడీ యల్ స్టాండ్స్ ఫార్ లవ్, 'ఏ' ఫార్ అట్రాక్షన్, 'డి' ఫార్ డిలైట్, అండ్ 'వై' ఫార్ యూత్ ఓకె" అన్నాడు కుమార్ శ్రీమతికి— అర్థంకాదు అన్న ధీమాతో,

"జవాబు తమాషాగా ఉంది"

"అది హమేషా ఉండేందుకేగా నిన్ను కట్టుకున్నది"

"ఐ-సీ-" అంది కళ్లు చక్రాల్లా త్రిప్పుతూ—

"ఏమిటోయ్ నువ్వు చూసేది" అన్నాడు మల్లెపువ్వుతో చెలిబుగ్గని తాకుతూ—

"ఇంటర్‌వ్యూ అయిపోయింది మీకు నిద్ర రావటంలేదా ? నాకు మంచు కొస్తూంది మేలుకోవడం నావల్లకాదు బాబూ ఏదైనా మిగిలుంటే—రేపు తీరికగా మాటాడుకోవచ్చు అదివారమేగా" అంటూ పక్కమీద వాలిపోయింది

ఒకన్ను చిన్నగా తెరచి, తనవైపు నిస్సహాయంగా చూస్తున్న శ్రీవారిని చూసేసరికి కరుణ కారిందేమో, "క్షమించండి". అంటూ చిన్నగా గొణిగింది, కుమార్ కౌగిలిలో ఒదిగిపోతూ

"వెనెంతో ఎప్పుడొస్తుందా అంతున్నా డార్లింగ్—" అనిమాత్రం పరవశంలో అనగలిగేడు—కుమార్

ఈమాటు శశాంకుణ్ని పాలించే బాధ్యత తారకి వచ్చి పడింది




*వెంకటూపురం వెళ్లే బస్ కృష్ణాపురం రోడ్ జంక్షన్ దగ్గిర ఆగింది బస్‌లోంచి ఒకానొక సుందరి దిగింది, ఆ వెంటనే మరొక సుంద్రరావు దిగాడు. బస్ వెళ్లిపోయింది*

సుందరి చేతిలో హాండ్ బాగ్, ఎటాచి కళ్లకి గాగుల్సు కాళ్లకి హై హీల్డు షూస్ జట్టు రేగి ఉంది మొహాన్న చెమట బిందువులు

సుంద్రరావు చేతులు జేబుల్లో ఉన్నాయి భుజాన్న ఓ బాగ్ వేలాడేసి ఉంది హిప్పీ లాంటి జట్టు దాన్ని అతగాడు బాక్ పాకెట్ లోంచి చిన్న దువ్వెన తీసి నున్నగా దువ్వు కొన్నాడు

"వచ్చావా, వెంకయ్యా!" అంది సంతోషంగా సుందరి వెంకయ్యని చూసి

"తమరొత్తుంటే రాకుండా ఉంటానా అమ్మాయిగారు! బాగా చిక్కిపోనారు!" అన్నాడు వెంకయ్య అమ్మాయిగారి చేతిలోంచి ఎటాచి తీసుకొని

అది తీసుకెళ్లి గూడు కట్టిన రెండెడ్ల బండలో పెట్టాడు. మైసూరెడ్ల బండి చూడ్డానికి డాబుగా ఉంది

బండివెనక క్రిందుగా ఉన్న మెట్టులాంటి ఇనుపరేకుమీద అడుగువేసి సుందరి పయ్యారంగా బండెక్కింది

చుట్టూ ఎక్కడా మనుష్యులు తిరగడం లేదు

"యీ బండెక్కడికి వెళ్తుంది?" అడిగాడు సుంద్రరావు సుందరిని

"భీమలాపురం"

"నేనూ ఆ ఊరే వెళ్తున్నాను కాస్త బండెక్కనిస్తారా?"

"ముందర ఎక్కండి"

సుంద్రరావు చక్రం కర్రలమీద అడుగువేసి పైకెక్కి వెంకయ్య ప్రక్కన కూర్చున్నాడు

బండి బయల్దేరింది కృష్ణాపురం రోడ్ జంక్షన్ నుంచి భీమలాపురం దూరం అయిదు మైళ్లు ముప్పావుగంట ప్రయాణం దారి పొడుగునా ఏవో చిన్న చిన్న ఊర్లు ఉన్నాయి గాని ఎక్కువగా చేలు, తోటలు జనం ఎక్కువగా తిరుగుతూ ఉండరు

మైసూరెడ్లు హుషారుగా బండిని లాక్కుపోతున్నాయి

"ఇంట్లో అంతా కులాసాగా ఉన్నారా?" అడిగింది సుందరి

"ఆ, కులాసాగా ఉన్నారమ్మా! మీగురించి అమ్మగారు బెంగెట్టుకున్నారు!"

"బెంగెందుకు?"

"ఎందుకేంటమ్మా! దూరంగా పట్నంలో ఒక్కరూ చదువుకుంటున్నారుగదా! ఎలా ఉన్నారోనని!"

"అంతేనా? యింకేమన్నా ఉందా? నిజం చెప్పు"

"యింకేముంటుంది అమ్మాయి గారూ?" వెంకయ్య అదోలా నవ్వాడు

"నువ్వు దాస్తున్నావు అవునా?"

"మీకు తెలియందేముంది, అమ్మాయి గారూ! నాచేతచెప్పించాలని చూస్తున్నారు!" వెంకయ్య తప్పించుకుంటూన్నట్టు ఎడ్లని అదిలించ సాగాడు

ఎడ్లు యింకావేగంగా పరుగెత్తసాగాయి

"మామయ్య ఇక్కడే ఉన్నాడా వెంకయ్యా!"

"ఆయనెక్కడికెళ్తారండి! నన్నేమాట సెప్పమంటారా?" వెంకయ్య సందేహిస్తూ అడిగాడు

"చెప్పు చెప్పమనేగా అడిగింది"

"చదువుకొన్నవారు మీరు చదువులేనివాడాయన ఆయనతో మీకు పెళ్లేంటమ్మా? అమ్మగారి చాదస్తంగాని!"

సుందరి మాట్లాడలేదు.

సుంద్రరావూ మాట్లాడ్డంలేదు

పరుగెత్తుతున్న ఎడ్లమెడలో మువ్వలు మ్రోగుతున్నాయి

బండి భీమలాపురానికి అరమైలు దూరంలో ఉంది చుట్టూ అన్నీ మామిడి, అరటి, చెరకుతోటలు, వరిచేలు మట్టిరోడ్డు ఎగిరే పక్షులు, చెట్ల ఆకులమధ్య ఆడుకొనే చిలకలు తప్పించి మరే సంచారం లేదు ప్రొద్దున్న పది గంటలు కావస్తోంది

"బండిని పుంతలోకి మళ్లించు" అన్నాడు సుందర్రావు ఉన్నట్టుండి గట్టిగా, లేచినిలబడి

వెంకయ్య కొంచెం బెదిరాడు కాని, సంబాళించుకొని,

"భీమలాపురానికి దారి యిటు గదండి" అన్నాడు

సుందర్రావు బాగ్‌లోంచి పిస్టల్ తీసి వెంకయ్యకేసి గురిపెట్టాడు

"అయ్యబాబోయ్!" అన్నాడు వెంకయ్య అంటూనే క్రింద కురకబోయాడు

"కదిలావంటే చంపేస్తాను చెప్పినట్టు చెయ్యి" అంటూ మళ్లా అరిచాడు సుందర్రావు

వెంకయ్య కూర్చున్నాడు.

"ప్రక్కకి మళ్ళించు"

"అదేంపనండీ! పోనీగదాని బండెక్కనిస్తే!" బింకంగా అంది సుందరి

'నువ్వు మాట్లాడక, అలాగే కూర్చో" సుందర్రావు పిస్టల్ సుందరికేసిచూపించాడు

"అమ్మాయిగార్ని యేం చెయ్యకండి, బాబూ!" అంటూ బండిని ప్రక్కకి మళ్ళించాడు వెంకయ్య

పుంతలో కొంతదూరం వెళ్ళాక ఓ మామిడిచెట్టు దగ్గిర బండి నాపించాడు సుందర్రావు కొమ్మలు క్రిందుగా ఉన్నాయి

"నువ్వు యిప్పుడు బండిదిగు"

వెంకయ్య దిగాడు

"యింటికి వెళ్లిపో"

"మరి అమ్మాయిగారు!" వెంకయ్య అయోమయంగా అడిగాడు

"అమ్మాయిగారు బండీలోనే ఉంటారు"

"అయ్యబాబోయ్! అయ్యగారు నాప్రాణాలు తీసేత్తారు!"

"జరిగిందిచెప్పి, యిక్కడికి పిలుచుకురా!"

"బాబు గదూ! అమ్మాయిగార్ని వొదిలేయండి, నేను కూడా తీసుకెళ్ళిపోతాను అయ్యా! మీ కాళ్లట్టుకొంటాను" వెంకయ్య బ్రతిమలాడాడు



"పిల్లేదు నువ్వువెళ్లి అయ్యగార్ని ఒక్కర్నే పిలుచుకురా కూడా ఎవ్వర్నయినా తీసుకొస్తే అమ్మాయిగార్ని కాల్చేస్తానని చెప్పు పో"

"అలాగేనండి" అంటూనె వెంకయ్య పరుగు పుచ్చుకున్నాడు

మరి కొంతసేపటికి సుబ్బావధాన్లు, వెంకయ్య పరుగెత్తు కొచ్చారు ఆ వెనక లక్ష్మమ్మ ఆ వెనక లక్ష్మమ్మ తమ్ముడు రామన్న బండిపైన మామిడిచెట్టు కొమ్మ మీద సుందరి, సుందర్రావు కూర్చొని ఉన్నారు

వాళ్లందర్నీ చూడగానే సుందర్రావు, సుందరి మెడకి పిస్టల్ గురిపెట్టి, "మీ రొక్కరు తప్పించి మిగిలిన వాళ్లందర్నీ ఫర్లాంగు దూరంలో ఉండమనండి లేకపోతే మీ అమ్మాయి మీకు దక్కదు" అన్నాడు గట్టిగా సుబ్బావధాన్లతో

"అయ్యో, అయ్యో!" అంటూ రాగాలు తీయసాగింది లక్ష్మమ

"వెళ్లవే ముందు, తర్వాత ఏడుద్దువు గాని!" అని కసిరాడు అవధాన్లు "మీరు కూడా పొండిరా" అన్నాడు మళ్లా

వెంకయ్య, రామన్న, లక్ష్మమ్మ నెమ్మదిగా దూరంగా వెళ్లారు

"ఎవరునువ్వు?" అడిగాడు సుబ్బావధాన్లు

'నా పేరు నాలుగు సున్నాల తర్వాతపేడు'

"అదేంపేరు? అయినా మా అమ్మాయితో నీకేంపని?"

"నావి మూడు కోరికలు అవి మీరు తీరుస్తేనే మీ అమ్మాయి మీకు దక్కుతుంది లేకపోతే అంతే"

'ఏమిటా' కోరికలు?"

"ఒకటి నాకు ఆకలిగా ఉంది గారెలు కావాలి"

"ఊళ్లో హోటలూ, పాడూ యేంలేదు ఉన్నట్టుండి గారెలు ఎక్కడ్నించి వస్తాయి? దానికి ముందు పప్పు నానబోయాలి, రుబ్బాలి, ఎంత పనుంది?"

'నాకదేం తెలియదు! తింటే గారెలే తినమన్నాడెవడో అంచేత నేను గారెలే తింటాను" యింకా వినండి నారెండో కోరిక నన్ను మీ యింట్లో ఉండనివ్వాలి"

"నీదే వర్ణమో యేమో! పైగా ఆ పిస్టలుతో మా యింట్లో యెలా ఉంచుకోమంటావు?"

"దేశంలో కులం, వర్ణం వగైరాల





# హై జా కీ యం

ప్రసక్తి యెత్తితే నేరమన్న సంగతి తెలుసా మీకు ? నేను చెప్పినట్టు వింటే మీకు యెలాంటి యిబ్బందీ ఉండదు ''

''నీ మూడో కోరిక యేమిటి ?''

''మూడో కోరిక మీ అమ్మాయి సుందరిని నాకిచ్చి పెళ్లి చెయ్యాలి ''

''అదేం కోరిక ?'' లబోదిబో మన్నాడు సుబ్బావధాన్లు

''మీరు అలా అనవసరంగా గోలచేసి ప్రయోజనముండదు నా కోరికలు తీరిస్తేనే మీ అమ్మాయి మీకు దక్కేది ?''

''నీ గోత్రమేమిటో, ఋషులెవ్వరో, జాతకం వగైరా ఏవీ తెలీకుండా పిల్లని నీకిచ్చి పెళ్లి చేసేయమంటే యెలా ?''

''నా గోత్రం హిప్పీ గోత్రం ఋషులు హ్యూ హెఫ్నర్, షాన్ కానరీ, యాసిర్ అరాఫత్ ఇంక జాతకం చెప్పమంటారా ? మధ్య ఇంటిలో శని, ముందు వరండాలో రాహువు, వెనక వసారాలో కేతువు ప్రక్క గదుల్లో బుధ గురులు మిగతావాళ్లంతా దొడ్లో యీ సమాచారం సరిపోతుందా ?''

''హిప్పీ గోత్రమా ? యీ గోత్రం, ఋషుల పేర్లు ఎప్పుడూ వినలేదే ? '' నసుగుతూ బుర్రగోక్కున్నాడు సుబ్బావధాన్లు

''నేను చెప్పగలిగిందేదో చెప్పాను మీరు విన్నా వినకపోయినా చేసేదేంలేదు మీకు సరిగ్గా గంటమైమిస్తున్నాను యీ గంటలో మీరు నా మొదటి కోరికని తీర్చకపోతే, మిగతా రెండు కోరికల విషయమై అంగీకారం యివ్వకపోతే, మీఅమ్మాయి మీకు దక్కదు ఆ తర్వాత నేనూ మీకు దొరకను !''

''అయ్యో ! అయ్యో ! ఇదేం అఘాయిత్యం ? . ఏమే అమ్మలూ, నీకు యిష్టమేనుటే ? అమ్మాయి కిష్టమౌనో కాదో తెలుసుకోవద్దుటయ్యా ?'' ఖంగారు పడ్డాడు అవధాన్లు

''మీ అమ్మాయి ప్రస్తుతం ఏం మాట్లాడదు అమ్మాయి యిందులోంచి మాట్లాడుతుంది, వినండి'', అంటూ సంచిలోంచి టేప్ రికార్డర్ తీశాడు టేప్ ఆన్ చెయ్యగానే, ''నేను యీయన్నే పెళ్లి చేసుకుంటాను '' అని మూడు నాలుగుసార్లు వినబడింది

''యిది అమ్మలు గొంతే !'' ఆశ్చర్యంగా సుబ్బావధాన్లు తనలో తానే పైకి గొణిగాడు

''ఇంకా నిలబడతారేం ? వెళ్లండి. యిప్పుడు సరిగ్గా పదకొండున్నర నాకు ఆకలి చరచర లాడుతోంది పన్నెండున్నర లోగా మీరు గారెలు తీసుకురావాలి''

సుబ్బావధాన్లు హడావిడిగా పరుగులాంటి నడక పుచ్చుకున్నాడు

''ఏమండీ, అమ్మాయి కులాసాగాఉందా ?'' ఆందోళనగా అడిగింది లక్ష్మమ్మ

''అమ్మాయి బాగానే ఉంది మనకే వచ్చింది వినాశకాలం !'' రొప్పుతూ అన్నాడు అవధాన్లు ''ఏమండీ ? ఏమయింది ?'

''ఉన్నపళంగా గారెలు కావాలంటాడు ! ఎక్కడ్నించి తెస్తాం ?''

లక్ష్మమ్మ ఒక్కనిమిషం ఆలోచించింది

''ఇవాళ రమణమ్మ యింట్లో తద్దినమండీ ! పోనీ, వెంకయ్యని పంపించి కొసిని తెమ్మంటే !''

సుబ్బావధాన్లు భార్య సమయస్ఫూర్తికి ఆశ్చర్యపోయి మెచ్చుకొని ''పోరా, వెంకయ్యా'' అన్నాడు

వెంకయ్య పరుగు పుచ్చుకున్నాడు

''హమ్మయ్య ! యింతేగదా, గారెలిచ్చేస్తే అమ్మాయిని వదిలేస్తానన్నాడా ?''

''అబ్బే, అదేంగాదు ! తనని మనింట్లో పెట్టుకొని అమ్మాయినిచ్చి పెళ్లిచెయ్యాలిట''

''అయ్యో, అయ్యో ! యిదేం అల్లరండీ! పోలీసు రిపోర్టివ్వండి ''

''పోలీసు రిపోర్టిచ్చిందాకాయేదీ ? గంటలో అన్నీ తేలిపోవాలంటున్నాడు ! పోలీసు స్టేషను దగ్గర్లో ఉందా, ఏమన్నానా ?''

''అమ్మాయి ఊరుకుందా మరి ? గోల చెయ్యడం లేదుటండీ !''

''అమ్మాయి యేం మాట్లాడ్డంలేదు అదేదో యంత్రం అమ్మాయి గొంతుతో మాట్లాడ్తోంది–'నేను యీయన్నే పెళ్లి చేసుకుంటాను' అని !''

''అది టేప్ రికార్డరంటారు నాకు తెలుసు ! మనం అందులో మాట్లాడితే, అది మళ్లా మన మాట మనకి అప్పజెప్తుంది !'' రామన్న ఉత్సాహంగా తనకున్న తెలివితేటలు బయట పెట్టడానికి వచ్చిన అవకాశం వినియోగించుకున్నాడు

''అయితే అమ్మాయే ఆ మాటలు చెప్పి ఉంటుంది !''

''ఏదో పీకనొక్కి చెప్పించి ఉంటాడు !''

"అలాలేదు, మామూలుగానే ఉంది?"

"ఏంచెయ్యడం ?"

ఒక్క గంటలో తేల్చమంటే యేంచేస్తాం! వాళ్లిద్దరికీ యిష్టమే అయితే మనం చేసేదేముంది ?"

"అలా అని పిల్ల గొంతు కోస్తామండీ?"

"అమ్మాయే తన కిష్టమంటుంటే యేం చేస్తాం ?"

"వాళ్లిద్దరూ ప్రేమించుకునుంటారక్కయ్యా!" రామన్న మరోసారి తన తెలివితేటల్ని ప్రదర్శించుకున్నాడు

"ఏమోనమ్మా, మా కాలంలో యిలాంటివేం యెరగం!" లక్ష్మమ్మ ముక్కు మీద వేలేసుకుంది

"పోనీ, ఆ మాటేదో అదే చెప్పకూడదు తిన్నగా యింటికొచ్చి!"

యింతలో వెంకయ్యగారె లుపటు కొచ్చాడు

# హైజాకీయం

"పదండి, అక్కడే అమ్మాయిని నిలదీసి అడుగుదాం" అంది లక్ష్మమ్మ

"అంతలం రావద్దన్నాడు గదా! నలుగురం వెళ్తే ఏం చేస్తాడో యేమో!"

"మీ రిక్కడే ఉండండ్రా, రాముడూ, వెంకయ్యా! మేమిద్దరం వెళ్లొస్తాం" తెగించింది లక్ష్మమ్మ

యిద్దరూ బయలుదేరారు

"ఏమండీ, గారెలు తెచ్చారా" అడిగాడు సుందర్రావు చెట్టుకొమ్మమీంచి

"ఆ, తెచ్చాం యింక మా అమ్మాయిని వదిలిపెట్టు, బాబువి కదూ! నీకు ఆ జన్మాంతం ఋణపడి ఉంటాం"

"ముందవి బండిమీద పెట్టి మీరు దూరంగా వెళ్లండి

సుబ్బావధాన్లు బండిమీదపెట్టి, వెనక్కొచ్చేశాడు సుందర్రావు సగంతను తిని మిగిలినవి సుందరికిచ్చాడు సుందరికూడా తింది

"యిప్పుడు చెప్పు మా అమ్మాయిని మాకిచ్చేసి నీ దారిన నువ్వెళ్లు బాబూ! కావాలంటే యీ పూటకి మా యింట్లో ఉండి, రేప్పొద్దున్న వెళ్దువుగాని!" బతిమలాడారు లక్ష్మమ్మ అవధాన్లు

"పెళ్లిమాటేమిటి ?"

"పెళ్లిమాటెత్తకు,నాయనా! యిలాంటిది రాక్షస వివాహమనిపించుకోబడుతుంది! అది యెవ్వరో శ్రీకృష్ణుడు లాంటివాళ్లకి చెల్లుతుందిగాని మనలాంటివాళ్లకి గాదు!"

"కరెక్టే! శ్రీకృష్ణుడు కూడా హైజాక్ చేశాడు! ఒప్పుకుంటాను అంతమాత్రాన నేను చెయ్యగూడదని యేంలేదు!"

లక్ష్మమ్మ, అవధాన్లు ఒకరి మొగాలొకరు చూసుకున్నారు

"ఆలస్యంచేసి ప్రయోజనం లేదు ఇంకా సరిగ్గా పదినిమిషాలే ఉంది! త్వరగా తేల్చకపోతే, చేతులుకాలాకఆకులుపట్టుకున్నట్టవుతుంది"

"ఏమే, ఏం చెప్పమంటావు!"

"తప్పేదేముంది ? అమ్మాయి అలా ఉలక్కుండా పలక్కుండా కూర్చుందాయెను! కానివ్వండి, యేంచేస్తాం ? పిల్ల ప్రాణం కన్నానా!" రాగాలు తీస్తూ అంది లక్ష్మమ్మ

"సరేనయ్యా! దిగిరా!"

"క్రిందకి దిగాక మాట తప్పకూడదు"

"తప్పను"

"మీ జందెంమీద ప్రమాణం చెయ్యండి"

"ఇదిగో మా అమ్మాయిని నీకిచ్చి పెళ్లి చేస్తాను"

ఆ తర్వాత బండెక్కి అందరూ ఇంటికి చేరుకున్నారు

సుందరి యింట్లోకి వచ్చాక నవ్వుతూ తిరుగుతుండడం చూసి, ఈ నాటకంలో కూతురికి కూడా భాగం ఉందని గ్రహించినట్లై లక్ష్మమ్మ "యెవరే అతను ?" అనడిగింది సుందరి లక్ష్మమ్మ చెవిలో ఏమో చెప్పింది కాసేపటికి—"హోర్నీ, నువ్వట్రా! దీక్షితులు కొడుకువా! ఒక వేలువిడిచిన మేనల్లుడివే నాకు!" నవ్వాడు అవధాన్లు

"ఒకవేలే విడిచో రెండువేళ్లు విడిచో నాకు తెలియదుగాని, మేమిద్దరం చాలా కాలంగా పెళ్లిచేసుకోవాలను కుంటున్నాం" అన్నాడతను.

ఎల్ ఐసి పాలిసీహోల్డర్ల ప్రయోజనంకోసం ప్రకటింపబడింది

# మీ బెనిఫిషియరీని వెంటనే పేర్కొనండి



## క్లెయిము చెల్లింపును త్వరిత పరచుటకు అది సహాయపడుతుంది

భీమా చేయబడిన వ్యక్తి చనిపోతే పాలిసీ డబ్బు ఎవరికి లభిస్తుంది? బెనిఫిషియరీగా పేర్కొనబడిన వ్యక్తికి మీ ఎల్ఐసి పాలిసీలో మీ బెనిఫిషియరీ పేరు ఉదహరింపబడకపోతే ఇప్పటికీ మించిపోలేదు ఏ ఎల్ఐసి ఆఫీసునుంచి అయినా ఒక నామినేషన్ ఫారమును తెప్పించండి మీరు మరణిస్తే మీ పాలసీ డబ్బు మీరు ఎవరికి సంక్రమించాలని అనుకుంటారో—మీ భార్య, మీ పిల్ల లేక ఏ ఇతర వ్యక్తి వారి పేరు దానిలో ఉదహరించి దానిని ఎల్ఐసికి వెంటనే పంపండి మీ బెనిఫిషియరీకి ఆ పాలిసీని గూర్చి తెలియపరచండి

మీ ఇన్సూరెన్సు క్లెయిముల చెల్లింపులో ఆలస్యములను తొలగించుటకు మీరు తీసుకోవలసిన ఇతర చర్యలు

వయస్సును గూర్చిన ఋజువును దాఖలు చేసి దానిని మీ పాలిసీలో నమోదు చేయించండి ఎల్ఐసికి మీ చిరునామా మార్పు ఏదైనా ఉన్నచో తెలియపరచండి ప్రీమియం సకాలంలో చెల్లించండి సరియైన ఆఫీసులో

మీరు పాలిసీ తీసుకొన్న ఎల్ఐసి ఏజంటును చి సహాయం పొందండి — లేక సమీపంలోని ఎల్ఐసి ఆఫీసును సంప్రదించండి — మీ పాలిసీ సక్రమంగా నడుస్తోందన్న విషయాన్ని ధృవపరచుకొనుటకోసం



లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

(RADEUS/LIC/AS 1)




## వెనకయ్య వింతలు

(34వ పేజీ తరువాయి)

వెళ్లిఉంటాడు

తండ్రిని ఎదిరించిన వేలుపు వినాయకుడు తప్ప మరొకడు ఉన్నట్టు తెలియడంలేదు అట్టి వానికి వీరు మనవారు, వీరు పైవారు అనే భేదం లేకపోవడంలో వింతలేదు

ఏనుగు మనిషికి ఎలక వాహనం ఎంతో వింతగానే కానవస్తుంది ఈ వాహన నిర్ణయంలో ఏదైనా అంతరార్థం ఉన్నదేమో అని అనిపిస్తుంధి

వినాయక విగ్రహాన్ని పచ్చిమన్నుతోనే తయారుచేస్తారు దానికే రంగులు పూసేవారు పూస్తారు పూజానంతరం ఉద్వాసన చెప్పి, ఆ విగ్రహాన్ని చెరువుల్లోనూ, బావుల్లోనూ ముంచివేస్తారు ఆ మట్టి విగ్రహం కరిగి మట్టిలో కలిసిపోతోంది కొందరు ఈ విగ్రహాన్ని ధాన్యపు గాదెల్లో అడుగున పడవేసి ఉంచుతారు పార్వతికొడుకు పంటల వేలుపు కదా! ఇతడు గాదెలో ఉంటే అక్కడున్న ధాన్యం తరుగులేక ఉంటాయని వృద్ధుల నమ్మకం ఎలుక ధాన్య విరోధి గణపతినే గాదెలో ఉంచితే, అతని యెడల ఉండే భయభక్తులవల్ల ఎలుక గాదెలో ప్రవేశించకుండా వుంటుందనీ, ధాన్యానికి నష్టం వుండదనీ మనవారి అభిప్రాయమని అనుకున్నా అనుకోవచ్చు ఇది కేవలం ఊహ మాత్రమే!

మహా మునుల ఆశ్రమాలలో పరస్పర విరోధులైన జంతువులు వైరం విడిచిపెట్టి స్నేహంతో ఉంటాయని కవులు వర్ణిస్తారు అవి స్నేహంగా వుంటాయో లేదో ఎవరు చూశారు? మన గణపతి మైత్రికి చక్కని ప్రమాణం! ఇతడు పామును నడుముకు కట్టుకుని దానికి బద్ధ శత్రువయిన మూషికాన్ని వాహనంగా చేసుకున్నాడు ఇవి రెండూ ఒక దాని కొకటి దగ్గరగానే ఉంటాయి!

వెనకయ్య ఎంతో వెర్రిబాగులవాడు! వెర్రిబాగులవాడు కాకపోతే తన విచిత్ర స్వరూపాన్ని చూచి ఆక్షేపణగా నవ్వి, తనకు మహోపకారం చేసిన చంద్రుణ్ణి నెత్తిపై ఎక్కించుకుంటాడా! ఇది ఇతని వెర్రిబాగుల తనాన్నే కాకుండా ఉదారతను కూడా తెలియజేస్తున్నది కదూ!

గణపతి ఎంత ఔదార్యం చూపినా, పొట్టనిండా పెట్టే వేయించుకున్నా ఇతడు కోరిన కుడుములూ, ఉండ్రాళ్లూ ఏడాదికి ఒక్కనాడు — వినాయక చవితినాడు మాత్రమే ఇతడికి దొరుకుతాయి ఇతర సమయాల్లో పరిస్థితి కనా కనికష్టంగా ఉంటుంది పసుపు ముద్దను గణపతిగా నిల్పి, ఉపచారాలన్నిటికీ అక్షింత

లతో తృప్తి పొందించి, బెల్లం ముక్కను నైవేద్యం పెడతారు, ఇతని అమాయకత్వాన్ని చూచి

గొప్ప బుద్ధి లి అయిన ఈ వేల్పు తలిదండ్రులకు ఏడుసార్లు ప్రదక్షిణంచేసి, భూ ప్రదక్షిణ ఫలం పొంది సిద్ధినీ, బుద్ధినీ వాహమాడి, క్షేమ, లాభాలనే పుత్రులను పొందినట్లు ప్రసిద్ధి ఇతన్ని కొలిచి, కార్య సిద్ధిని పొందవచ్చుననీ, అందువల్ల క్షేమం కలుగగలదనీ, బుద్ధిని పొంది, లాభాన్ని సంపాదించ వచ్చుననీ దీని అంతరార్థం. అంతే కాని, ఇతడు వివాహితుడని అనుకోరాదు నైష్ఠిక బ్రహ్మచారి అనే అనుకోవాలి

బులుసు వేంకటరమణయ్య

Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press MallikarjunaRao Street, Gandhinagar Vijayawada 3 Editor: S Radhakrishna

# నైసిల్*

# 'శాండల్‌వుడ్'

## మీ చర్మాన్ని రక్షిస్తుంది మీకు తాజాతనం ఇస్తుంది

సంవత్సరమంతా మీ చర్మాన్ని చురుకుగా ఉంచి సంరక్షించుటకు ప్రత్యేకమైన పదార్థములు గలిగియున్నది నైసిల్ ఒక్కటే దుర్గంధము కలిగించే సూక్ష్మజీవులను నాశనం చేయగల క్లోర్ ఫెనెసిన్ కలిగియున్నది చెమటను పీల్చుకొనుటకు ప్రత్యేక విధముగా తయారు చేయబడిన పౌడరు, స్వల్పమైన దురదలను, అంటువ్యాధులను రాకుండా అరికట్టుతుంది అంతేకాదు! మనోహరమైన చందనపు సువాసన కలిగి ఉన్నది మీకు తాజాతనం— నిజమైన తాజాతనం యిచ్చును!

*మీ చర్మానికి అవసరమైన ఔషధీయుక్త గుణవంతమైన నైసిల్ 'శాండల్‌వుడ్'ను ఎన్నుకొండి.*






**నైసిల్***

'శాండల్‌వుడ్

ఔషధీయుక్తమైన పౌడరు

**గ్లాక్సో** తయారీ

*ట్రేడ్ మార్క్

Sista's-GN-154 TEL



జగపతి పిక్చర్స్

# మంచి మనుషులు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత-దర్శకుడు: వి.బి.రాజేంద్రప్రసాద్ B.Sc.,

మాటలు: ఆత్రేయ-సత్యానంద్ సంగీతం: కె.వి.మహదేవన్ ఫొటోగ్రఫీ: ఎస్.వెంకటరత్నం W.I.C.A. కళ: ఎస్.కృష్ణారావు

ANNAPURNA

అన్నపూర్ణా ఫిలింస్ రిలీజ్